# ప్రబుద్ధాంధ్ర



విడి సంచిక రెండణాలు ౬ ౩ సంపాదకుడు

సంవత్సర చందా రూపాయి ౧౦ మార్చి ౧౯౩౫ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## విరాళములు

సంవత్సర చందాలవల్ల మాత్రమే ప్రబుద్ధాంధ్రను నిర్వహించడం కష్టం. ఈ సంగతి గమనించి ప్రబుద్ధాంధ్ర యెడల ఆదరం వున్న ఔదార్యవంతులు ఉత్సాహపరిమితాలైన విరాళాలు దయచేస్తున్నారు. ఈ నెలలో ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు.

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు

జయపురం ౨౫—౦—౦

## ఏజంట్లు కావాలి

ప్రబుద్ధాంధ్ర పత్రిక విడిసంచికలు అమ్మడానికి ఈ క్రింది స్థలాల్లో ఏజంట్లు కావాలి. మంచి కమిషను ఇస్తాము.

| | | | |
|---|---|---|---|
| ౧ | నెల్లూరు | ౧౨ | మద్రాసు |
| ౨ | గుడివాడ | ౧౩ | సామర్లకోట |
| ౩ | నరసారావుపేట | ౧౪ | బరంపురం |
| ౪ | నంద్యాల | ౧౫ | పాలకొల్లు |
| ౫ | కర్నూలు | ౧౬ | నరసాపురం |
| ౬ | కడప | ౧౭ | రేపల్లె |
| ౭ | అనంతపురం | ౧౮ | హైదరాబాదు |
| ౮ | గుంతకల్లు | ౧౯ | సికింద్రాబాదు |
| ౯ | ఒంగోలు | ౨౦ | గూడూరు |
| ౧౦ | కావలి | ౨౧ | పెద్దాపురం |
| ౧౧ | తిరుపతి | ౨౨ | వెంకటగిరి |

## ఈ కిందిచోట్ల ఏజంట్లు ఉన్నారు.

| | | | |
|---|---|---|---|
| ౧ | కాకినాడ | ౯ | చిత్తూరు |
| ౨ | పిఠాపురం | ౧౦ | నిడదవోలు |
| ౩ | అనకాపల్లి | ౧౧ | భీమవరం |
| ౪ | విశాఖపట్నం | ౧౨ | గుంటూరు |
| ౫ | విజయనగరము | ౧౩ | ఏలూరు |
| ౬ | తెనాలి | ౧౪ | బెజవాడ |
| ౭ | బాపట్ల | ౧౫ | అమలాపురం |
| ౮ | బందరు | ౧౬ | వాల్తేరు |

## కృతజ్ఞులము

ఈ సంచిక ముఖపత్రం మీది చిత్రమును రాసి ప్రబుద్ధాంధ్రకు శోభ కూర్చిన శ్రీ వరదా వెంకటరత్నంగారికి ఎప్పుడూ కృతజ్ఞులము.

సంపాదకుడు

## విషయసూచిక


| | | |
|---|---|---|
| ౧ | ఋషీ. మల్లాది రామకృష్ణశాస్త్రిగారు | ౭౩ |
| ౨ | టెక్నిక్. కొడవటిగంటి కుటుంబరావుగారు | ౭౮ |
| ౩ | యొ్యాన్ క్విక్సోట్. విశ్వనాధ సత్యనారాయణ గారు ఎం. ఏ. | ౮౧ |
| ౪ | హఠాత్తుగా లభించిన బాబు. కొలూరి వెంకటరామారావుగారు | ౮౪ |
| ౫ | అమ్మ నమ్మకుందాం. వేలూరి శివరామశాస్త్రిగారు | ౯౫ |
| ౬ | హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం. (౧ సంపాదకుడు ౨ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు ఎం. ఏ. బి. ఎల్. | ౯౮ |
| ౭ | రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు శాస్త్రి (భారతి) | ౧౦౦ |
| ౮ | వ్యాఖ్యానములు. (౧ కేశ్యల కొక సలహా. ౨ కీటకం ప్రవేశించింది. ౩ ఆమె మనసులోని మాట. ౪ మూంజీ గారి కొత్త సిద్ధాంతం. ౫ అందనుకి తెనుగురాయబారం ౬ ఒక్కొక్క రూపాయి వాటాలు) | ౧౦౨—౧౦౪ |


## ప్రబుద్ధాంధ్ర అయిదో సంపుటం

అయిదో సంపుటం బాపతు విడిసంచికలు పన్నెండూ రఫ్ కాగితాలవి అమ్మకానికి సిద్ధంగా వున్నాయి. వెల ఒక రూపాయి. పోస్టుఖర్చులు కలిపి మొత్తం ౧—౪—౦ ముందు పంపేవారికి వెంటనే పంపుతాము. వీ. పీ. చెయ్యము. ౧౦ సెట్టులే వున్నాయి.

ఇదే సంపుటం గ్లేజ్డుప్రతి బయండింగులో వుంది. అర్థ కాలికో బయండు చేయబడుతోంది.

వెల పోస్టేజీతో ౨—౧౨—౦.

ప్రబుద్ధాంధ్ర ఆఫీసు

రాజమండ్రి అని రాసుకోవాలి

### రామమూర్తి పంతులుగారి ఫొటో

ఆర్టుకాగితంమీద ముద్రించబడ్డ రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారి ఫొటో డజను ౧—౮—౦. వీ, పి. లో తక్కువ పంపము. పోస్టేజీ ౦—౬—౦.

కళాభివర్ధనీ పరిషత్తు

రాజమండ్రి

## అపరధన్వంతరి

## వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము

(రిజిష్టర్డు)

శరీరారోగ్యము కుంటువడకుండ కాపాడుకొనదలచిన ప్రతిమానవుడు తన శరీరారోగ్యము దుర్బలత చెందకుండ కాపాడుకొనవలెను. శరీరారోగ్యమునకు బలము ముఖ్యకారణము. అనేక కారణములచే దుర్బలుడగుచుండు మానవుడు బలమును ప్రయత్న పూర్వకముగ సేకరించుకొనవలెను. అట్లొనర్పక శరీరమునందు బలహీనతయను పెనురక్కసికి స్థావర మొసంగిన అసంఖ్యాకములగు రుగ్మతలు జనించును. చికాకు, తలనొప్పి, మలబద్ధము, నిద్రలేమి, అజీర్ణము, నరముల బలహీనత, గుండెలలో మంట, కాళ్ళుపీకు, రక్త మపరిశుభ్రమగుట, ఎండుకుపోవుట, క్షయ, ఉబ్బసము, పాండురోగము, రక్తహీనత, యీకారణమున చర్మమునిండ కురుపులు, తీట మున్నగు నెన్నియేని అసహ్యపు వ్యాధులు సంభవించును. వీటినెల్ల రూపుమాపి మంచి యుత్సాహమును, శరీరమునకు కాంతిని, నరములకు దృఢమైన బలమును, భాగ్యభాగ్యమగు అనేక అమూల్య ఓషధీ సారమగు జీవామృతము ప్రసాదించి మానవుని సంపూర్ణ సౌఖ్యసాగరమున నోలలాడించును. అధిక పరిశ్రమచేసి జీవయాత్ర గడుపవలసిన ప్రతివారికి యీ జీవామృతము అత్యవసరము. ఎంతటి బలవంతునైన శీఘ్రకాలములో దుర్బలస్థితికి తేగల శుక్లనష్టవ్యాధిని హరింపజేసి శరీరపుష్టిని కాపాడగల సుధారసము యీ జీవామృతము. చిరకాలము యేదేని దీర్ఘవ్యాధికి గురియై కృశించి క్షీణించినవారి కిప్పటి సంపూర్ణ ఆరోగ్యమును ప్రతిష్ఠింపగల పరమహంసక్రియ యీ జీవామృతము. దీనిని సేవించినంత కలుగు సత్ఫలములు ఒక్కమాటలో "ఏకారణముచే సంభవించిన నిస్సత్తువనైన హరింపజేసి, వ్యాధుల నాటంకపరచగల శ్రేష్ఠమైన బలవర్ధకౌషధము" అని చెప్పిన చాలును. ముప్పదియేడు వత్సరములనుండి అనేకులు ఉపయోగించి ప్రశంసించి యున్నారు. ప్రత్యేక కేటలాగునందు ముద్రింపబడిన యోగ్యతాపత్రములు జీవామృత ప్రాశస్త్యమును చాటగలవు. ఇందతిశయోక్తి యెంతమాత్రము లేదని ఒక్కసీసా ఉపయోగించిన మీకే విశదము కాగలదు.

పెద్దసీసా వెల రు 3—4—0 చిన్న సీసా వెల రు 1—12—0

సమస్తవ్యాధులకు ప్రశస్తమైన ఔషధములు దొరకును కేటలాగు ఉచితము.

**ఆయుర్వేదాశ్రమము**

తపాలుపెట్టె నెం. 287, మదరాను.




సంపుటము ౬    రాజమహేంద్రవరము   ౧౧ మార్చి ౧౯౩౫    3 వ సంచిక

# ఖుషీ

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు

బ్రహ్మచర్యంలోనుంచి-ఒకసారిగా-డబుల్ ప్రమోషన్ అయింది.

ఎందుచేతనో, రామమూర్తి, వానప్రస్థుడుగా మారిపోయి- దీర్ఘసెలవుపుచ్చుకుంటున్నాడు.

అందరికీ, ఇది చాలా విపరీతంగా కనబడుతూంది. కాని, ఎవరికివారు ఏదో సమాధానం ఊహించుకుని సరిపెట్టుకోవడమేకాని, నిజానికి ఏం జరిగిందో, ఎందుకు అలా, ఆకడ-తాత్కాలికంగా [?] సన్యాసి-మారిపోవలసి వచ్చిందో, నాకూ, మా శర్మకూ తప్ప... తెలియదు:

త్రిప్లికేన్లో, మా లాడ్జిలోనే, రామమూర్తికూడా ఉండేవాడు, లా చదువుతూ: అసలు శ్రద్ధగా కాలేజీకి వెళ్లేవాళ్ళకే మధ్యాహ్నం అంతా తీరుబడి: వెళ్ళనక్కర లేకుండానే, ప్రాక్సీగా అటెండెన్సు పడిపోవడం వల్ల, రామమూర్తికి రోజంతా తీరికే.

మనసులో నిలిచిపోయి, తీరని కోరికలన్నీ, కలలో, పిలవకుండానే సాక్షాత్కరించేవి: తెల్లవార్లూ కలత నిద్దురతో—చాలా ప్రొద్దెక్కిన తరువాతకాని మేల్కాంచేవాడుకాడు. అందరూ స్కూల్కు బయలుదేరే వేళకు కాఫీకోసం వెతుక్కుంటూ పోయేవాడు. భోజనం—ఏ ఒంటిగంటకో—కేవలం పోస్టులో ఉత్తరం వేసినట్టు మొక్కు తీర్చుకోవడం మాత్రమే:

మూడు, మూడున్నరపరకూ, ఏలాగో గడిపేవాడు చిడిముడిపాటుతో: నిదుర రాదు—ఉబుసుపోదు: ఏ పుస్తకం చదవాలనీ కూడా మనసులేదు: కొంచెంసేపు మాత్రం సినీమా మాగజీన్లు తిరగవేసి, బొమ్మలు, చూసీ చూడనట్లు చూసి, విసుగుతో ఓమూలకు గిరవాటు వేసేవాడు. ఆవేళకేసరిగా సిగరెట్లుకూడా అయిపోయేవి: వెళ్లి తెచ్చుకునేందుకు ఓపికలేదు—ఇన్ని అవస్థలతో—ఏలాగో టైమ్ అయ్యేది.

ఇకమీద, రామమూర్తికి నిమిషం తీరిక ఉండేది కాదు: టాయ్లెట్ చేసుకుని, సూట్ వేసుకుని, క్రాఫ్ నొక్కులు చేతితో సరిజేసుకుంటూ మేడమీద వరాండాలోనికివచ్చి నిలుచునేవాడు అటూఇటూ చూస్తూ:

ఎదటిమేడ గుమ్మంలో, వచ్చేపోయేవారి నందరినీ, కరవుమురసిపోయే [?] కన్నులతో చూస్తూ నిలువబడిఉండే మహారాష్ట్ర ప్రౌఢ, రామమూర్తి నీడ చూచాయగా కనబడగానే, చురచురచూసి, లోపలికిపోయి, కటకటాల తలుపు ధనాయించి వేసుకునేది: మావాడు, గొంతుసవ

రించుకుని, ఎత్తుకుంటూన్న సంగీతానికి బ్రేక్ పడి, అప శ్రుతిలో ఈలగామారిపోయేది:రోజూ, అలా మామూలే గనుక, ఏమీ అనుకోకుండా లోపలికివచ్చేసి, చెదరిన ఒకటీరెండు ముంగురులు సరిగా అమర్చుకుని, రిస్టువాచీ వంక నిదానించి చూసి, క్రిందకి వచ్చేసేవాడు:

రోడ్డుమీద—చక్కనివాళ్లు ఎవరైనా కనబడేటంత వరకూ ఆగి, వాళ్ళని అనుసరించి బీచికి పోయేవాడు: రెస్టారెంటులో టీ పుచ్చుకుని, ఆరని అగ్నిహోత్రంతో సమిధకు సమిధ ఆసలా యిస్తూ, ఒక్కమారి, క్యూ. యం. సి. వరకూ తిరిగివచ్చేవాడు: సంజె పడటంతోనే బయలుదేరి గృహోన్ముఖులైన కమిళాంగనలను యథాశక్తి కొంతదూరం వరకూ సాగనంపివచ్చి, బస్ స్టాండు దగ్గర కాపలా వేసేవాడు:

అనుకూలైన వాళ్లు ఎక్స్‌ప్రెస్‌లో తానూ జొరబడి, వాళ్ళను అనుసరించిపోయి...ఇంటికి జేరుకునేంతవరకూ తిచ్చాడి, లోపలికి వెళ్లి తలుపు వేసుకున్న చప్పుడైన తరువాత...ఇంటి మొగ మయేవాడు:

కొంచెం ఆలస్యం అయితే హోటల్లో శివరాత్రే: నాయర్ కడైలో ఏలాచని పాలుతాగి, బిస్కట్లుతిని, వచ్చేసేవాడు: తీరావచ్చినతరువాత—మేము నరమూ, మేలుకుని ఉన్నా, కొంచెతనానికి—పలికేవాళ్ళంకాదు తలుపుతీసేవాళ్ళంకాదు: ధణధణకు వీధివారందరూ లేచినా, మా తలుపు అలాగేఉండేది: ఏమనుకునేవాడో ఒకొక్కప్పుడు మాకే జాలివేసేది—తిరిగి బీచికిపోయి, తలకు కర్చీఫ్ కట్టుకుని పడుకుని, చలికి బిగిసి అవస్థపడి తూర్పు తెలవారే వేళకు, తెల్లవాళ్లూ రమాకుమారుణ్ణి పాదదానునిగా ఏలుకొను అపక్రవిక్రమం నెరపిన వీరపురుషావతారం,పోజులో తయారయేవాడు లాడ్జికి—

పొరబాటున, కదలించామో, అరేబియన్ నైట్సులో కథ ఒకటి తయారుచేసి చెప్పేవాడు—మేము, నమ్మడంలేదు, వెక్కిరిస్తున్నా మన్నా ఖాతిర్ చేస్తేగా! కథ ముగిసిన తరువాత—నిద్ర—

ఇదీ రామమూర్తి దినచర్య—ఎఫ్. యల్ పరీక్షలు దగ్గరకు వచ్చినాయి—రోమన్ లా పేరు ఎత్తితే మండిపడేవాడు, కాని, కామినీప్రశంస లేనిదీ క్షణం జరగదు:

౨

—మేము ఎంత ఒత్తుకుని వైదొలగినకున్నా—ఒక్కతె అయినా ఒత్తిగిలి దోవ ఈయడం లేదు:

గంగకు ఇద్దరి ఐనా పరవాలేదనే సంప్రదాయం వాడిని గనుక, ఇక అక్కడే ఆగిపోదామన్నాను: కాని, శర్మ ఉహూఁ అనిముందుకు అడుగు వేస్తూనే ఉన్నాడు: కాని, దారి తీయడానికి—స్త్రీజనంలో—వాడికి సాధ్యంకాలేదు:

పార్థ సారథి బ్రహ్మోత్సవం ఆఖరిరోజు—వీధుల్లో మెసలడానికి వీలులేనంత సమ్మర్దంగా ఉన్నది:

—మావీధుల్లో ఉండే తెలుగు కుర్రవాళ్ళ ముఖాలు నడనడాన, దవనమూ చేమంతులూ విరిసిన తురుముల చాటునుంచి కనబడుతున్నాయి ప్రసన్నంగా:

రామమూర్తికి ఇంటిదగ్గనుంచి టెలిగ్రాం వచ్చింది—ఎందుకో తొందరగారమ్మని—అతను, మాకు యీ వారం రోజులనుంచీ కనబడటమే లేదు:

నేనువద్దని వారిస్తూ ఉన్నా, శర్మ, రామమూర్తిని వెదికి తీసుకురావాలనే వంకపెట్టి బయలుదేరాడు—అసలు లోపల వాడికి తహతహలాడు తూంది—ఎప్పుడు వెళ్లి ఆజనం కిటకిటలో కలిసిపోదామా అని:—నేనూ, బతిమాలించుకుని, బింకం చెడకుండా వెంట నడచాను.

శర్మ ఆకారవైఖరినీ, దీర్ఘకాయాన్నీచూసి ఎవరూ తప్పుకోడంలేదు: బలవంతాన రెండడుగులు వేసి, స్టీమ్ అయిపోయిన రోడ్‌రోలర్ లాగా చప్పబడి ఆగిపోయినాడు...నావైపుచూసే సరికి నేను నవ్వుతున్నాను. అంతలో ఎక్కడలేని రోషం వచ్చేసింది వాడికి—

మాంచి ఆలోచన చేశాడు—మళ్లా వెనుకకువచ్చి, జపాన్ బెలూన్ బూరా ఒకటికొన్నాడు: పూరించి, గోళాన్ని పెద్దదిచేసి, దాన్ని, మోతతో,—తప్పుకోని పుణ్యాంగనల చెంపలకు తాకిస్తూ—వాళ్లు ఉలికిపడి—తిట్టుకుంటూ తప్పుకోగా—ఎలాగో— ఆలయప్రాంతం వరకూ రహదారిచేశాడు :

ఒక్కక్షణం ఆగి కలయచూశాము—రామమూర్తి కనబడలేదు, కాని—మన తెలుగువాళ్లు అసాధ్యులు—

అప్పుడే ఎవ్వడు కనిపెట్టారో—అందరూ తలో బూరా పూరించి, కామినీచక్రా న్నంతా కలగుండు పెట్టేస్తున్నారు :

—శర్మకు ఉక్రోషం వచ్చి—'ఇంతే వెధవాయలు! —ఎవరన్నా ఏంచేస్తే—దాన్ని కాపీకొట్టాడమే' అని తెలుగుజాతిని అంతా దూయబట్టుకుని, నిర్వేదంతో, సత్తువకొద్దీ పూరించేటప్పటికి, బుడగ, చిన్నసైజు ఫిరంగీలాగా మోగింది: మళ్లా ఒకటి కొనిద్దామనిపించింది కాని, వాడిని చూడబోతే దుర్నిరీక్షుడుగా ఉన్నాడు: ఆపట్టున ఎన్ని అయినా ఆగేటట్టు లేవు—

విసివి, వేసారి తిరిగి వచ్చేస్తూ—కార్‌స్ట్రీటు మొగదల, గుంపుజేరితే, అంచుకు వెళ్లాము—ఏమిటో విశేషమని—చాలామంది, అర్ధచంద్రాకృతిగా కమ్ముకుని—నిలుచుని, తగవుతీరుస్తున్నారు. ఒక ఆమె, ఊరికే లెక్చర్ కొడుతూంది—ఎవరికితో చినది వారంటున్నారు—మధ్య—తెల్లమొఖం వేసుకుని, బిక్కపోయి చూస్తూ చెదరిన క్రాపింగ్‌తో—రామమూర్తి'—

ఏముందీ—మామూలు విశేషమే—మనవాడి రసపిపాస అతిగా వెళ్లింది—ఎవరో అమ్మాయిని కటాక్షవీక్షణంతో సత్కరించాడు—వెంటనున్న ముసలమ్మ—గదమాయిస్తూంది !

శర్మ అమాంతం తోసుకువెళ్లి, ముందుకు—ఏమిటీ గలభా అని కలయజూసి అడిగాడు—రామమూర్తి శర్మను ఎరుగనట్లు నటించాడు :

అందరి సమాధానాల హోరులో అసలు సంగతి ఏమిటో తెలియలేదు: శర్మ, రామమూర్తి చేయిపట్టుకున్నాడు: ఆముసలమ్మ అడ్డంవచ్చి—'ఆహా—నాయారో తెరిమా—ఆ—అందపరువు సమ్మకిట్ట వేహాదు—స్టేషన్‌కు...' అని గదమాయిస్తూండగానే, శర్మ హుంకరించి వృద్ధా కరగ్రహణం చేసి 'స్టేషన్‌కు—వా' అని లాగాడు :

పాచిక పారింది—అందరూ గడబిడగా ఎవరిత్రోవను వాళ్లు తప్పుకుని—ముసలమ్మనూ—ఆముగ్ధాంగననూ బలవంతాన నడిపించుకుని పోయినారు—

—ఇంటికి వచ్చేవరకూ, ఏమరమూ మాట్లాడలేదు—తలుపుతీసి, స్విచ్ వేశాను: రామమూర్తి, ఈజీచైరులో ఉన్న పుస్తకాలుతీసి క్రిందకు విసిరివేసి కూలబడ్డాడు, పరధ్యానంగా: వాడి జేబులోనుంచి, సిగరెట్టు అందుకుని, ముట్టిస్తూ, శర్మ, ఓమారు, ఆకనివేపు పరకాయించి చూసి—

'ఏమిటా గలభా,' అన్నాడు :

రామమూర్తి, చూసి ఊరుకున్నాడు : శర్మ ప్రశ్నపరంపర కురిపించాడు—చివరకు, గత్యంతరము లేక, జవాబు చెప్పక విధిలేక, నిదానించి, కుర్చీలోనుంచి లేచి, పక్కమీద వాలుతూ,

'మన్మథుని అమోఘప్రభావం రా భాయీ! అని గర్వంగా చిరునవ్వాడు :

శర్మ ముందుకు ఉరికి, పక్క అంచున నిలుచుని చుర చుర చూస్తూ,

'ఒరేయ్ ! వాడి బాబు ఇంకోడున్నాడు : ఇన్స్పెక్టరు సింగ్—ఆ తమాషా తడిపితే తెలిసేది—ఏహో—పిచ్చవేషాలు...'

...ఉక్కబోస్తున్నా, లెక్కచేయకుండా, రామమూర్తి ముసుగు బిగించాడు—

3

—అప్పటికి, మూడోమాటు...చదవడం—

'తేనె సోనలాని ఊబును
పోని కొదమ షట్పదాళి
గానమాధురి—
సగము విరిసి తొలివలపుల
నిగారించు విరిచేడెల
మొగ మాటము—
జిలిబిలిగా మలసిన వె
న్నెల నెలరేకల వెలసిన
చెలిమి...
మధుమాన యామినీ
మాధవుని—ప్రియకామినీ

ఇన్ని హాయలతో—
ఇన్ని వగలతో...
ఎన్నడెన్నడని
ఎదురుచూసి—మురిసి...
చిగురుకు—
తొగరాయనితో
మొగమాటము
తగవేసమ్మా!

—అవాళ రేడియోలో మంచి ప్రోగ్రాముఉన్నది—

—అప్పటికే ఆలస్యమైంది. ఇక బయలుదేరుదామను కుంటూంటే, రామమూర్తి—నిలవేశాడు:

పద్యాలు వ్రాయడం—మాకు యిష్టమున్నా లేకపోయినా పంతంకొద్దీ వినిపించడం—అతనికి పరిపాటే, కాని, యీధోరణి అదోరకంగా ఉన్నది—

'ఏలాఉంద' అని మళ్లా నిక్కచ్చిగా అడిగాడు:

'......ఇంకా టీ పడలేదు కాదూ, కొంచెం తల దిమ్ముగా ఉంది' అని పెంకెగా జవాబుచెప్పాను, కోపం వచ్చి అయినా వదులుతాడేమోనని—

కాని, ఇదేం లక్ష్యం చేయకుండా, తాపీగా—

'అదికాదోయ్—పద్యం...?'

'ఆం—బాగానేఉంది'

'అలా అంటేకాదు—నీకు సరిగా ఏలా తోచిందో చెప్పాలి'

'చెప్పలేనుబాబూ...ఇక చంపకు'

'దీన్ని—దీన్ని ఒక పనిపట్టి వ్రాశాను—'

'అలాగేం'

'నిజంగానే—మరి ఎందుకో—ఊహించుకో—'

'రామ్మూర్తీ...నీకు కోపం వస్తేనేంగాని ఎందుకు వ్రాశావో చెప్పనా...'

'ఓ'

'వళ్లు పొగరెక్కి...ఏమిటి ఊరికే సతాయించడం'

—అంతటితో వదులుతాడనుకున్నాను—ఉహు... నావెంట వచ్చేశాడు తిన్నగా—టీ పుచ్చుకున్నాడు... సరసను నడుస్తున్నాడు— ప్రెసిడెన్సీ కాలేజీదాకా వచ్చాక—చప్పున ఆగి...

'చెప్పనా?' అన్నాడు.

ఏమిటో తెలియక పోయినా, నేను తలఊపాను...

'—ఆ అమ్మాయి, ఇలియట్స్‌రోడ్డులో ఉంటుందోయ్ చాలా చక్కనిది—...'

'కావచ్చును—'

'మాటకు అడ్డంరామాకు— నిజంగానే చాలా అందంగా ఉంటుంది. వారంరోజులనుంచీ చూస్తున్నాను...'

'ఇంటిదాకా సాగనంపడం లేదూ?'

చాల్లే—నీమాటలు—సరేకాని, వాళ్లయింటిరోడ్డుకేసి రెండుమూడుసార్లు వెళ్లాను—కనిపించింది—మేడమీద పోర్టికోలో నిలుచుని—అదేదో తమాషాగా, పిలుస్తున్నట్లుగా, చూస్తుందోయ్— నాకు ఏమీ తోచడం లేదు—

'పిలిచిందని నమ్మకముంటే—

'సందేహంలేదు—మనసుకి అలాగే తడుతూంది'

'అలాగైతే తిన్నగా వెళ్లిపోరాదూ...

'అంతకన్న ఇంకో ఎత్తువేశాను...ఆ అమ్మాయి సంగీతం పాడుతుంది రోజూ, బాగా చీకటిపడిన తరువాత—వాళ్ల ఇంటిఎదట—మైదానంలో కూర్చుని ఈపాట పాడేస్తాను, అప్పుడన్నానా ఆ వేదన—నామనసులో కోరిక, అర్థంచేసుకోలేదూ—మందలింపు గ్రహించలేదూ...'

'అయితే, ఇంతకూ తెలుగువచ్చునో, రాదో?'

'వచ్చును—మవ్వర్‌తో తెలుగునమాట్లాడటంవిన్నాను—నామీద మనసుందోయ్ ఆ అమ్మాయికి...'

'అయితే, భావకవిత్వమెందుకూ— డైరెక్టుమెథడ్ అప్లైచేయి. తిన్నగావెళ్లిపో...

'అచ్ఛా...'

—రోడ్డుదాటి, సైడ్‌వాక్ మీదికి వచ్చాము—రామమూర్తి దిక్కులు చూస్తున్నాడు...

'రార మా యింటిదాకా...అని రేడియోలో పాట వినవస్తూంది

—నాచేయి గట్టిగానొక్కి...'అదుగో ఆ అమ్మాయే!—చూడు!...' అని చాలా ఆదుర్దాతో, రహస్యం లాగా చెప్పాడు—

—మాకు చాలా సమీపాన, కారు తలుపుమీద ఆని, ఓరగా నిలుచుని...ఆ అమ్మాయి... సదురూ బెదురూలేకుండా...చూపులతో ఆహ్వానిస్తూంది...

'ఊఁ...వెళ్లు' అన్నాను...

'నీవుకూడా—రా...

'బలే...

'కాదు నేను చెపుతానుకాదూ... ఎంతో దూరం లేదు...'

మావాడి తడబాటు గమనించినట్టుగా ఉన్నది కాబోలు...కారు ఎక్కకుండా దిగి...నడక సాగించింది.. మేము సరే, వెనకాల......

—వాళ్లయింటివద్దకు వచ్చేశాం...ఆమె గేటు తీసుకుని, లోపలకు వెళ్లుతూ...వెనుదిరిగి...మళ్లా ఆహ్వానించింది మౌనంగా...

కదను తొక్కుతూ, నవోఢ లాగా రామమూర్తి—ఆతన్ని నడిపించుకుంటూ నేను...

—తిన్నగా లోపలకు వెళ్లకుండా... తోటలో... మందారం—గుబురుదగ్గర నిలుచుని ఉన్నది...నేను వెనుకకు తగ్గాను...

మళ్లా...మళ్లా... దగ్గరకు రమ్మని సైగచేసింది... రామమూర్తి...ఏలాగైతే, నేం.. ఎదటికిపోయి...నిలుచున్నాడు...

'ఎందుకూ...అంత...సిగ్గు'—అని అడిగేసింది... మనవాడు......

'ఈలా...రండి...రా...ఇక్కడికి...

నేనూ అనుకోలేదు, ఆలా జరుగుతుందని...

ఆమె, తానే రామమూర్తిని సమీపించింది ..అల్లరి కుఱ్ఱవాణ్ణి దండించే అయ్యవారి పోజుతో...

చెవి తమ్మె పట్టుకుని నులేసి...

'అందమైన ఆడపిల్ల కనబడగానే...ఈలా తిరగడానికేనా, చదువుమీద వంకపెట్టి ఇక్కడకు చేరుకునేది... నీలాటి తెలుగు కుఱ్ఱవాళ్లు? ...,వారం రోజులనుంచీ చూస్తున్నాను...బీచికి వచ్చిన ప్రతి పిల్లనూ...చూపులతో కబళించేస్తున్నావు...

'...ఇక ఎన్నడూ...ఈలా చేయక.. ఏం...

—ఆమె వయ్యారంగా విసిరినా, చేయి, ఛళ్లుమని మోగింది...రామమూర్తి చెంపమీద...ఖంగారు పడిపోయినాడు...నాకూ, ఏమిచేయడానికీ...తోచలేదు...

'...క్షమించండి...మీ ఎదట... మీ స్నేహితుణ్ణి, అవమానించినందుకు: కాని, మీరు చూడాలనే...

'బలేదాన' వని మెచ్చుకొన్న చూపులతో, ఆ అమ్మాయి కరస్పర్శ చేసి...తిరిగి, తలవంచుకుని... లోలో నవ్వుకొంటూ—రామమూర్తి మాటే మరచిపోయి...బయటకి వచ్చేశాను...

—జయ...విజయీభవ...అని, ఎదురుగా శర్మ... ఎక్కడనుంచి ఊడిపడ్డాడో...నవ్వుతూ దోవకు అడ్డంగా నిలుచుని ఉన్నాడు...

రామమూర్తి...ప్రూస్పడి పోయినాడు...

... ... ... ...

రామమూర్తికి అప్పటినుంచీ, దీక్ష మొదలు...బీచి ఛాయలకన్నా వెళ్లడంలేదు...చెదరిన క్రాపు సరిచేయడంలేదు...

చదువు సాగకపోయినా...వేళకు భోజనంచేసి... ఇంటిపట్టున నిద్రపోతున్నాడు...

కాని...ఇది ఈలా సాగుతుందని...నాకు ఏమాత్రమూ నమ్మకంలేదు...మళ్లా...

—ఐనా...అందాకా వస్తే...అప్పుడు చూసుకోవచ్చు:

# టెక్నిక్

కొడవటిగంటి కుటుంబరావుగారు

మనం చేసే ప్రతిపనిలోనూ టెక్నిక్— ఒక విధానం, ఉండాలి. తరతరాల నించీ అనేకవిషయాలు రక్తంలో వస్తుండటం వల్లా, ఇతరుల ననుకరిస్తుండటం వల్లా మన మనేకపనులు జయప్రదంగా చెయ్యగలుగుతున్నాం. ఆదిలో నాలుగుకాళ్లమీద నడిచిన మృగం వెనకకాళ్లమీద నిలబడి నడవాలని ప్రయత్నంచేసింది. అప్పుడా నడక చాలా అసహ్యంగా ఉండి ఉండాలి. కాని కాలక్రమాన అవసరమైన టెక్నిక్ సంపాదించి ఈనాడు రెండుకాళ్లమీద నడవటం అప్రయత్నంగా జరిగిపోతున్నది. తప్పటడుగులు వేసేపిల్లలు మధ్య మధ్య పడుతూండడం నడక కవసరమైన కండరాలు మొదలైనవి లేక కాదు, ఆ టెక్నిక్ అనేది బాగా అలవడక. ఆవిధంగానే చాలామంది పెద్దవాళ్లయికూడా ఒంటినిండా, చుట్టూ, ఎంగిలి కాకుండా భోం చెయ్యలేరు.

ఈ టెక్నిక్—పనులు చేసేవిధానం—కాలక్రమాన మార్పు చెందుతుంది. అది సామాన్యంగా నాగరికతలో కలిగే మార్పుల ననుసరించి, అభిరుచుల్లో మార్పుల ననుసరించీ ఉంటుంది.

భోం చెయ్యటమే తీసుకుందాం. ఈ నాటికింకా ఈ పని బహిరంగంగా చెయ్యబడటం లేదు జనసామాన్యం చేత. అందుచేత భోజనం చేసే విధానం ఒంటిమీద ఎంగిలి పడకుండా చూసుకునే వరకే ఉపకరిస్తుంది. కొంతకాలానికి నాగరికత ప్రబలి భోజనం బహిరంగంగా చెయ్యటం అలవాటవుతుంది. (అనేక కారణాలవల్ల అది చాలా అవసరం. ఇప్పటి నాగరికతలోనే వనసమారాధనల్లోనూ, పంక్తి భోజనాల్లోనూ, ప్రతిరోజూ కాఫీహోటళ్లూ, పూటకూళ్ల ఇళ్లలోనూ బహిరంగంగా భోజనం చెయ్యటం జరుగుతూనే ఉంది.) అప్పుడు మీద ఎంగిలి పడకుండా చూచుకుంటే చాలదు. చూచేవాళ్లకు అసహ్యం కలగరాదు. ఇప్పుడు పాశ్చాత్యు లేదైనా తాగేటప్పుడు అసహ్యంగా చప్పుడు కారాదు, అంతా ఒక్కగుక్కను తాగరాదు, తినేదానిమీదనే దృష్టిఉన్నట్టు కనపడకుండా ఉండటానికి తింటున్నంతసేపూ ఏవో స్వల్పవిషయాలను గురించి మాట్లాడుతూండాలి. ఇంకా ఇటువంటివి ప్రతిదాన్లోనూ ఉంటూఉంటై. వాటిలో ఏది చాతకాకపోయినా ఆమనిషిలో అంతవర కది తీరని లోటే.

సందర్భాను సారంగా ఒకే నాగరికతలో ఒకే పని చెయ్యటానికి భిన్నమైన టెక్నిక్ కావలిసివస్తుంది. మనం మామూలుగా మాట్లాడేటప్పుడు వినేవాళ్ళర్థం చేసుకోవటమే పరమావధి. అదే నాటకరంగం మీద మాట్లాడటానికి పరిశుద్ధమైనఉచ్చారణా దూరానికి స్పష్టంగా వినపడే శృతీ అవసరం. రైలందుకోటానికి పరిగెత్తేవాడెట్లా పరిగెత్తినా తొందరలేదు రైలందితే సరి. అదే మైలురేస్ చేసేవాడు చాలా మెళుకువలు తెలుసుకుని మరీ పరిగెత్తాలి.

ఈ టెక్నిక్ కళలోకి వచ్చేటప్పటికి ప్రాణంతోడేస్తుంది. నృత్యం తీసుకోండి. దానికి ప్రాణం లయ. దాని శరీరం టెక్నిక్ అభివృద్ధినిపట్టి ఉంటుంది. రాజ్ శ్రవణగోచరం కాగానే సాగం దోరా దోరసాన్లు మెల్లిగా అటూ ఇటూ ఊగుతూ లయను సూచిస్తారు కూర్చున్నచోటినించి కదలకుండానే. అదే నృత్యమైతే నూటికి తొంభైతొమ్మిదో ఇంకా ఎక్కువో నృత్యం చెయ్యగలవాళ్లు తేల్తారు. లేచి కదలవలిసి రాగానే కొంతమంది వెనక పడతారు. ఈ నృత్యంలోకి నవరసాలు లాక్కొచ్చి వాటి కనుగుణ్యమైన అభినయం చెయ్యమనేటప్పటికి ఎంతో టెక్నిక్ అవసరం కావటమే కాక, ముందుగా ఆ టెక్నిక్ ఇట్లా ఉండాలి అని తేల్చటానికే చాలా శాస్త్రయుక్తమైన శోధనా, నియమాలూ, అభ్యాసమూ తప్పనిసరవుతై. ఇంతటితో ఆగక నవరసాలనూ మళ్లీ విభజనచేసి మనిషి ఒప్పించగలిగిన రసాలు కొన్నివందలయ్యేటప్పటికి అక్కడక్కడా ఒక్కొక్కడు తేల్తాడు. ఈ రసాల విభజనకు కాని భరతశాస్త్రానికి కాని అంతూ పరిపూర్ణత్వమూ లేవు. శాస్త్రానికి తాత్కాలికంగా పరిపూర్ణత్వం మనమే ఇచ్చి తృప్తిపడవచ్చును, కాని నాగరికత ఆగేదికాదు. క్రమంగా, ఒంటిమీద పడకుండా

భోం చెయ్యటంతో మనుష్యులు తృప్తిపడనట్టే నవరసాలతో తృప్తిపడక ఇంకా నాజూకైన రసాలు కోరతారు. దేంతోనో దాంతో తృప్తిపడటమే పరమావధయితే ఎక్కడివాళ్ళక్కడ కూర్చుని ఊగి ఇదే నృత్యం అనవచ్చును. డెబ్భైరెండు మేళకర్తలతోనే తృప్తిపడి జన్యరాగాలకు ఉద్వాసన చెప్పవచ్చును.

అంత మాత్రానికే సంభవాలైన రసాలన్నిటికీ ప్రాముఖ్యత ఇవ్వాలనిగాని, జన్యరాగాలన్నిటికీ స్థానం ఇవ్వాలనిగాని నా అభిప్రాయం కాదు. ఎన్నిరకాల ఇళ్లు కట్టవచ్చునో అన్నిరకాల ఇళ్ళూ కట్టుకుంటున్నామా; కళాదృష్టిలో వాటికిస్థానం ఉండటం చాలా అవసరం. అందుచేత ఇది గుడ్డెద్దు చేనుపడ్డట్టు తరిగించే విషయం కాదు. నేను చెప్పినశాస్త్రయుక్తమైన శోధనవల్లగాని ఏదీ తేలదు. సమర్థుడైన వాడు ప్రసవవేదన అభినయించి చూపేదాకా, కళాదృష్టిలో ఆవేదనయొక్క అభినయానికి స్థానం ఉందని మనం కలలోనైనా భావించలేక పోవచ్చును.

ఇకనాటకం ప్రదర్శనానికి వచ్చేటప్పటికి ఎంత టెక్నిక్ వినియోగింపబడుతుందో చూచేవా డూహించుకోవటం అసంభవం. ఒక్కరోజులో నాటకం గీకేసి ఒక్క రిహార్సలయినా లేకుండా నాటకం ఆడి ఆ నాటకం జయప్రదం చేద్దామని కాని ప్రదర్శన సఫలం చేద్దామని కాని అనుకోవటం భ్రమ. "వేనరాజు"కు మద్రాసులో జరిగిన సత్కారాన్ని గురించి విన్నాం కదా!

టెక్నిక్ అనేమాట చాలామందికి ఏవగింపుగా ఉండటం నేను స్వయంగా గమనించాను. వాళ్ల ఉద్దేశంలో ఆ మాట నాటకాలను గురించీ అభినయశాస్త్రాన్ని గురించీ ఏమీ తెలీనివాడు చాలా తెలిసినట్టు కనపడటానికి ఊతఊతగా ఉండే నిరర్థకమైన పదం. నిజమే. మాటలను దుర్వినియోగం చెయ్యటం అంతటా జరుగుతూనే ఉంది. ఈ మధ్య మా ఊళ్ళో బిచ్చగాడు "మీ హరిజన్నుణ్ణి!" అంటూ వెంటపడుతున్నాడు కాంగ్రెసువాళ్లకే చాలా తలనెప్పిగా! రచనలోనూ ప్రదర్శనలోనూ విధానమంటూ లేదనేవాళ్ళకు చెప్పేదేముంది?

నాటకం రాసేవాడు ముందు టెక్నికల్‌గా నాటకం లోపాలు లేకుండా చూసుకోవాలి. దానికి నాటకం బాగోగులతో ఏమీ సంబంధం లేదు. కన్యాశుల్కం మంచినాటకం కాదని ఎవరూ అనరనుకుంటాను. దృశ్యం మధురవాణి ఇంటిముందునించి చప్పున చెరువుగట్టుకు మారుతుంది. రివాల్వింగ్ స్టేజిమొహం ఎరగని ఆంధ్రులు ఇక్కడ ఏం చెయ్యాలి. మా వూరువారు చెరువుగట్టులేకుండా పని గడిపేస్తున్నారు. సహజంగా ఉంటుంది కదా అని ప్రతిఅయిదు నిమిషాలకూ ఇద్దరు ముగ్గురు పాత్రలచేత ఒక్కసారిగా మాట్లాడిస్తే చదవటానికి బాగున్నా చూడటానికి దుర్భరంగా ఉంటుంది. ఈ విధంగా టెక్నిక్ లోపాలు వేనకువేలుగా ఊహించవచ్చును. రచనా విధానంలో బ్రహ్మాండమయిన లోపాలు కల నాటకాలు నిరాఘాటంగా ప్రదర్శించబడుతున్నై. మల్లాది అవధానివంటి కుర్రవాడు అసంపూర్ణరామాయణం రాసి చూపిస్తేనూ చింతాదీక్షితులు ప్రభృతులు నాటకప్రహసనం రాసి చూపిస్తేనూ ఆంధ్రులు లోపాలున్నవని గమనించేటట్టూ లేకపోతే లేనట్టూ. వారైనా ప్రదర్శనా విధానంలో కలలోపాలు బహిరంగపరిచారు. రచన?

నాటకం రాసేవారూ, ప్రదర్శించేవారూ నటులూ—ఈముగ్గురూ ఏకమైతే కాని నాటకం రక్తికీ రంగానికీ రాదని "ప్రబుద్ధాంధ్ర" యొక్క గతసంచికల్లో ఒకదాన్లో సూచించబడ్డది. అట్లా జరగనిపక్షంలో ఎంతభయంకరమైన పొరపాట్లు జరిగేదీ ఊహించవచ్చును. బెర్నార్డుషా రాసిన "డెవిల్స్‌డిసైపుల్" అనే నాటకం కొత్తలో ప్రదర్శించే టప్పుడు ముఖ్యపాత్రధారి విమర్శకుల సూచన ఒకటి ఆధారం చేసుకుని షా అభిప్రాయానికి విరుద్ధంగా నటించాడు. ముఖ్యపాత్రయొక్క శీలానికే భంగం కలిగింది! ఆవిధంగానే భమిడిపాటి కామేశ్వరరావుగారి నాటికలు ప్రదర్శించే టప్పుడు ఎక్కడ నాటకకర్త సహజంగా ఉండాలని ఉద్దేశించాడో ఎక్కడ విపరీతంగా చెయ్యాలని ఉద్దేశించాడో కనుక్కోకుండా చేస్తే రసం లోపిస్తుంది. నాటకం అభివృద్ధవు

తున్న కొద్దీ దాన్ని పాడుచెయ్యటానికి బాగుచెయ్యటానికీ సూక్ష్మమైన లోపాలే పనిచేస్తై. ఆరోజు కారోజు నాటకరచయితా నటుడూ ఈ సూక్ష్మదృష్టిని అలవాటు చేసుకోకపోతే నాటకకళ అభివృద్ధి పొందేది ఉత్తది.

ఎంతో దూరం పోనక్కర్లేదు. కన్యాశుల్కం మినహాయిస్తే మిగతా నాటకాల్లో బంతులను నటుడు కొద్ది స్థూలనియమాల ననుసరించి దాదాపు ఏవిధంగానైనా చెప్పవచ్చును—చెప్పుతున్నాడు.

“ప్రతీ గాడిదకొడుకూ నాయింట్లో తిని నన్న నేవాడే! తాంబూలా లిచ్చేశాను. తన్నుకుచావండి!”...

“మాటలు మా జోరగా వస్తున్నాయ్!—నన్నేనా వెధవలంటున్నాడు!”...

ఇటువంటి వాక్యాలు రెండు విధాలుగా చదవటం ఎట్లాగో నాకు బోధపడలేదు. సమర్థుడైన నటుడికి సహితం “ఈ వాక్యం ఎట్లా చెప్పితే బాగుంటుందా!” అనే సమస్య వచ్చినప్పుడు ఆ వాక్యాలు నాటకంలో నించి ఎత్తివెయ్యటం చాలా మంచిది. ఆలెక్క ప్రకారం చాలా నాటకాలు లేస్తై.

అసలు మన తెలుగులో చాలా డ్రామాలు డ్రామెటిక్ గానే ఉండవ దేం ఖర్మమో!

నాటకం రాసేవాడూ, నటించేవాడూ ప్రదర్శించే వాడూ పోగా వారి టెక్నిక్‌ను నిర్ణయించేవి కనీసం రెండున్నై. ఒకటి భాషా, రెండోది ప్రేక్షకవర్గమూ.

లక్షణబద్ధంగా పద్యాలు రాసేవాడికైనా అక్కర్లేని భాషాసామ్రాజ్యాలు నాటకం రాసేవాడి చేతులో ఉండాలి. కవికి పదిమాటలు దొరికేచోట నాటకం రాసేవాడికి ఒక్కమాటే దొరుకుతుంది. కవిత్వం కన్న పెద్దకళ నాటకం రాయటం. ప్రతాపరుద్రీయంలో మంగళ్లకూ చాకళ్లకూ సాయిబులకూ తడుముకోకుండా భాష సంపాదించిన మహామహోపాధ్యాయుడికి రాజుకూ, మంత్రులకూ భాష దొరకలేదు. వాళ్లకు గ్రాంధికం ఉపయోగించటం వల్ల ఏమీ ఉపయోగం కాలేదు. ఆయన భాష దొరక్క గ్రాంధికం ఉపయోగించాడని కాదు, గ్రాంధికం తప్పని ఆయనకు తెలిసి ఉన్నట్టయితే తగిన వాడుకభాష దొరకటంలో కొంత కష్టమై ఉండేదని. ప్రతాపరుద్రుడు ఏభాష మాట్లాడా డన్న సమస్యే లేదు. ఉంటే ఆరోజుల్లో తురకలూ, మంగళ్లూ, చాకళ్లూ ఏం మాట్లాడా రన్న సమస్యా ఉంటుంది. (హైదరుజంగుకు హిందీ ఉపయోగించి గడుపుకుంటున్నప్పటికీ, వినేవాళ్లను గౌరవించే నాటక కర్త సమస్త సజాతులకూ ప్రేక్షకులకు తెలిసిన భాష ఉపయోగిస్తాడు. బుస్సీ ఫ్రెంచి మాట్లాడటం అసంభవం, అప్పుడు పాశ్చాత్యుడు తెలుగు మాట్లాడినట్టు రాయటం తప్పదు. అట్లాగే హైదరుజంగూ తురక తెలుగు మాట్లాడాలి కాని ఏదీ కాకుండా హిందీ ఏమిటి?) మరి ప్రతాపరుద్రుడు వాడుకభాష మాట్లాడితే ఆగాంభీర్యం ఉండదేమో! దానికి వాడుకభాషమీద ఎంతో పట్టు ఉంటేనేగాని రాయటం కష్టం. అందుకని ప్రతాపరుద్రుడు మొదలైనవాళ్లు స్వేచ్ఛగా గ్రాంధికం ఉపయోగించారు.

కళను ప్రదర్శించే విధానానికీ ప్రేక్షకుడికీ చాలా సంబంధం ఉంది. నవ్వటం, ఏడవటం మొదలైన పెద్ద రసాలను ప్రకటించటంలో తప్ప మిగతా వాటిల్లో దేశదేశానికీ మార్పుంది. అనుకరణశబ్దాలకే చాలా తేడా ఉంటున్నది భాషకూ భాషకూ. అందువల్ల రసవిభాగాలను ప్రకటించేటప్పుడు ఇతరో దేశస్తుడు నటుడేం చూపుతున్నదీ కనుక్కోలేక పోవచ్చును. మన నృత్యం పాశ్చాత్యులకు ఎగతాళిగా ఉంటుంది. వాళ్ల నృత్యం మనకు బూతుగా ఉంటుంది. ఒకరి సంగీతం ఒకరికి కర్ణకఠోరంగా ఉంటుంది.

నేను భిన్న దేశాలను తీసుకుంటున్నాను. ఒక ఇంగ్లీషు నటుడీమధ్య ఈ విధంగా చెప్పాడు. “నేను భావప్రకటనా విధానం ప్రేక్షకులను బట్టి మారుస్తాను. శనివారం మాటినీనాడు హాలంతా పనిచేసుకునేవాళ్లతో నిండి ఉన్నప్పుడూ, కుర్చీలన్నీ ఉద్యోగస్థులతో నిండి ఉన్నప్పుడూ ఒకటే రకంగా చెయ్యటం అసంభవం!” ఒకటే భాష, ప్రేక్షకులు ఒక సంఘంలోవాళ్లే! స్థానం నరసింహారావుగారు సికింద్రాబాదు ప్రేక్షకులకు “మేం కన్యాశుల్కం ఆడితే మీరు దాన్లో రసం గ్రహించలేరు” అన్నప్పుడు కొంతమందికి కోపం వచ్చింది.

నేను వింటుండగా అక్కడ కొందరు పెద్ద లీవిషయం తెచ్చి ఆగ్రహం సూచించినపుడు నరసింహారావుగారిది తప్పేనని నేను ఒప్పుకోవలసి వచ్చింది. వారు మొహాన పట్టుకుని అన్నట్టు వాళ్లు అడివి మనుష్యులే అనుకున్నా, వాళ్ల కర్థమయ్యేటట్టు నటించగల నేర్పు నరసింహారావుగారిలో ఉంటే ఆముక్క అనక్కర్లేక పొయ్యేది!

# యోహ్యాఁ—క్రిష్టిఖెయ్

విశ్వనాథ సత్యనారాయణగారు ఎం. ఏ

ఉరిఖిలా నీగ్రోనాయకుఁడు. అతనికి నాకు మొదటిసారి పరిచయము చిత్రముగా నైనది. కివు సరస్సుదగ్గర గుమ్మైన చెట్లపైని మాటుపెట్టి పులికై నే నెదురుచూచుచుంటిని. అది మసకవేళ. అనేక వనమృగములు దప్పికకై వచ్చుచుఁ బోవుచున్నవి. రెండు మూఁడాడసింహములు వచ్చినవి. నేను పులినే కొట్టవలెనని యాగితిని. ఇంతలో నావెనుక భయంకరమైన ధ్వనియైనది. నేను వెనుదిరిగి చూచితిని. ఉత్తరాఫ్రికాలో గనిపించు బార్బరీవానర మొకటి తీవ్రమైన యమ్ముచేతఁ గొట్టబడి తటుకుమనే పడిపోవుచుండెను. చెట్టుక్రిందికి జూచితిని. తలలో నీకలు, కట్టిన వాకుబట్టలు, గాఢోగస్ముఁడు నొక నీగ్రో వేటగాడు పరుగెత్తుకొని వచ్చుచుండెను. అతఁడువచ్చి నన్ను దిగిరమ్మని సంజ్ఞచేసెను. నేను దిగివచ్చితిని. నాకుఁ గొంచెము కొంచెము నీగ్రోభాష తెలియును. అతనికిఁ గొంచెము కొంచెము ఫ్రెంచిభాష తెలియును. బార్బరీవానరము నన్నుజూచి నా మీఁద దుముకఁబోవు చున్నదనియు నందుచేత నతఁడు దానిని విషలిప్తబాణముతోఁ జంపితిననియు నిటువంటిచోట్ల మాటుపెట్టరాదనియు, బాబూన్, గిబ్బన్ మొదలైన వానరములు మనుజుల నూరకే యెదురించుననియు, వృక్షములమీఁద గూడ మనిసి సురక్షితుఁడు కాడనియు, జెప్పెను. మే మిర్వురము కలసిపోతిమి. నాటనుండి యురిఖిలాకును నాకును మైత్రి. ఉరిఖిలా విచిత్రపురుషుడు. నీగ్రో పల్లెలలో నడవిలో నీగ్రో జాతివానివలెనే వేసము ధరించియుండును. పెద్దపట్టణములలో బెల్జియనులవలె వేషముధరించి మంచి నాగరికునివలె సంచరించును.

నేను యామ్ముయా పట్టణమున నివసించుచుంటిని. యామ్ముయా అరువిమినది యొడ్డుననున్నది. అరువిమి కాంగోనదికి శాఖానది. ఉరిఖిలా పట్టణమునకు వచ్చినపుడెల్ల నాతో గలసి మాటాడును. ఒకనాడు సాయంకాలము మే మిర్వురము నరువిమియొడ్డున నడచుచుంటిమి. కొంతదూరము పోయిన తరువాత నొక పెద్దదిబ్బవద్ద నిలుచుండి యురిఖిలా రెండుచేతులు జోడించి యెదుటనున్న ఫాలమున శిరస్సున నద్దుకొని నమస్కారించి వంగి శిరసు నేల నానెను. నే నేమిటని యడిగితిని. అతఁడు నేత్రములయందు సునిశితత్వము భాసించగా యోహ్యాఁ క్రిష్టహిమిఖెయ్,—యోహ్యాఁ క్రిష్టపిఖెయ్ అన్నాడు. అతఁడన్నది నాకుఁ దెలియలేదు. నే నప్పుడడిగినను నతఁడు చెప్పినట్లులేదు. అతఁడు దీర్ఘాలోచనా పరుఁడై తల వంచుకొని రెండుచేతులు వీపువెనుక గలిపికట్టి నడచుచుండెను. కొంతదూరము పోయిన తరువాత నతఁడు నావంక దిరిగి "యోహ్యాఁ క్రిష్టపిఖెయ్ నెఱుగవా" యనెను. నే నెఱుగ నంటిని. అతఁడు 'హిమిఖెయ్ గొప్పకవి. మా భాషలో నతఁడువ్రాసిన గీతములు చాలయున్నవి. అతఁడడవిపిట్ట. వాగులోనిచేప. కాంగోబిడ్డ! యనెను.

నేను నీగ్రోభాషలోఁ గొన్ని మధురములైన గీతములున్నవని యెఱుఁగుదును. నీగ్రోల గొంతులలో మహామాధుర్యమున్నది. వారి కొన్నిపాటలు వారు పాడుచుండగా వారి శరీరముల నైల్యము, వారి మొగముల యందలి వికారము నున్నవా, లేవా యనిపించుచుండును. నిజమునకు నీగ్రోవారి సంగీతశక్తివలన యురపుదేశపు సంగీత మెంతవృద్ధి పొందినది! ఉరిఖిలా యిట్లని చెప్పెను. 'హిమిఖెయ్ మీ బెల్జియనుల నాగరకత గిట్టనివాడు. 'అతఁడు మొదటినుండియు దనగీతములయందు మీ తెల్లవారి మార్గములు నిరసించుచుండెను. హిమిఖెయ్ నావలె మోటువాఁడు కాడు. అతఁడు మీవలెనే, మీ దుస్తులనే వేసికొనుచుండెను. అతఁడు ఫ్రెంచిభాష వ్రాయను చదువను గలఁడు. అతఁడు తనగీతములు ఫ్రెంచి లిపిలో వ్రాసి, ఫ్రెంచిభాషలో వానికర్థమువ్రాసి పత్రికలలో ప్రకటించుచుండెను. అతనిగీతములు న్యాంగ్వే, న్యూ ఆంట్వర్పు, లొయాంగో మొదలైన పెద్దపట్టణములలోఁ గూడఁ జదువుచుండిరి. ప్యారీనగరములో నతని గీతములయందు గొప్ప సానుభూతి కలిగెను."

"కాని కాంగోదేశమున మిషనరీలకు నిచ్చటి పాలకులకు నతని ప్రబోధము గిట్టినదికాదు." నేను "నీకతని గీతము లేమైనవచ్చునా" యని యడిగితిని. అతడు వచ్చునని తల యూపెను. నేనొకటి పాడుమంటిని. అతడు తనగొంతు మంచిది కాదనియుఁ దననోటఁబడి హిషిఖియ్ మధురగీతములు పాడై పోవచ్చుననియుఁ జెప్పి యిట్లనెను "కివు సరస్సుమీద కిస్సాలికా యను నొక సన్ననిపిట్ట యెగురుచుండును. దానికూత మిక్కిలి సన్ననై యది యొక విచిత్రముగ నుండును. కిస్సాలికా మఱియొక సరస్సుమీద నెగురదు. ఇంకొకచోట నుండదు. ఈ 'ఇటురీ' (అరువిమినది కింకొక పేరు) పది పరుగులపైని సన్నగానుండి యొకకొండ లోయలో నొకరాతి బెజ్జము నుండి జారిపడును. ఆ పడునప్పుడు క్రిందనున్న చెట్లకొమ్మలపైఁ బడుచుండును. ఆపడునప్పు డొక సన్ననిధ్వని కలుగును. కిస్సాలికాకూత యా ఇటురీ యాకు మీద పడుధ్వనివలె నుండును.

కివుపై కిసాలికా, కివుపై కిసాలికా
ఇటురి ఆకులపైన చిటిలిపడు కిసాలికా
ఫ్రాంసుల తుపాకికై ప్రాణముల వదలెదవో
కివునీట నీశవము కువకువలు నేయునో
కివుమీది కిసాలికా కివుపైని కిసాలికా
నీవు కివుకలసెదవు నేను కివుకలసెదను
మన తియ్యనగుపాట మాయమైపోవునా ?
కివుమీది కిసాలికా కివుపైని కిసాలికా
ఇటురి జొంపముమీద చిటిలిపడు నవ్వడుల
నీనామధురగీతి నిలిచియుండును లెమ్మ
కివుమీది కిసాలికా కివుపైని కిసాలికా.

ఉరిఖిలాకంటి తుదలయందు సన్నని నీటి బిందువులు కూడెను. అతడొక తన్మయత్వ స్థితిలో నుండెను. నే నతని బుజముపైఁ జేయివైచి "ఉరిఖిలా" యంటిని. అత డదరిపడెను. నేను 'హిషిఖియ్ తరువాతి కథయేమి' టని యడిగితిని. ఉరిఖిలా మరల చెప్ప నారంభించెను.

హిషిఖియ్ దేవుడు. కాంగోనది యవతార మెత్తిన మూర్తి. అతనిని నశింపఁజేయుట యెట్లాయని తిక్కన వారందఱకుఁ బుట్టెను. అందులో మా నీగ్రోలును జాలమంది యుండిరి. యీముయూకు క్రొత్త గవర్నరు వచ్చెను. ఆరోజున హిషిఖియ్‌ని మాట్లాడవలసినదని బలవంతపెట్టిరి. హిషిఖియ్ మాట్లాడెను. అతడు వ్రాసిన కీర్తనలు కొన్ని పాడెను. వాని కర్థములు చెప్పెను. జనమెల్లరు తుపాకి వేసి నట్లుండిరి. ఆనాడు హిషిఖియ్ కాంగో దేవతవలె మహాభయంకరుడయ్యెను. పడవలను దలక్రిందులుచేయు కాంగోనదివలె నత డందరి మనస్సులను దలక్రిందులు చేసెను. ఉన్నత ప్రదేశములనుండి క్రిందికి లంఘించు కాంగో పాతములవలె హిషిఖియ్ అల్పభావముల మీదికి లంఘించెను. అతడు మాటాడి నంత సేపెవ్వడును గదలలేదు. అందఱు దిగ్భ్రాంతియో యానందమో యనుభవించుచుండిరి. నాడెవరి దారిని వారింటికిఁ బోయిరి. మఱునాడూరిలోఁ గలకలము బయలుదేరెను. ఒకడు హిషిఖియ్ గర్వియని, మఱొకడు హిషిఖియ్ రాజద్రోహియని, యింకొకడు హిషిఖియ్ గవర్నరును నిందించెనని, వేఱొకడు హిషిఖియ్ క్రైస్తవ మతమును దిట్టిపోసెనని నోటికొక మాటగాఁ జెలరేగిరి. నిజమునకు హిషిఖియ్ ఆనాడు తన పద్యములను జదివెను. వాని కర్థములు చెప్పెను. గవర్నరును బొగడెను. నీగ్రోల కవితాశక్తిని మెచ్చుకొనెను. అతడు చేసిన దింత మాత్రమే. హిషిఖియ్ గొప్పవాడని, నీగ్రోజాతి సంప్రదాయము లనుసరించువాడని, హిషిఖియ్ కవితాశక్తి ముందు తామంతఱు నిలువజాలమని హిషిఖియ్ మీదఁ గత్తికట్టి క్రైస్తవులైన నీగ్రోలును పాలకుల యందలి మిషనరీలును హిషిఖియ్‌ని పత్రికలలో దూషించిరి. ప్రతి పత్రికలోను దొంగ హిషిఖియ్, విప్లవకారుడు హిషిఖియ్ అని వ్రాయ మొదలుపెట్టిరి. హిషిఖియ్ వీనికి వేటికిని సమాధానములు వ్రాయలేదు. తరువాత నెలనాళ్లకు హిషిఖియ్ మీద పెద్దకేసు పెట్టిరి. హిషిఖియ్‌ను బట్టుకొనుటకు రాజభటులు వచ్చిరి. హిషిఖియ్ తానప్పుడొక పాటపాడెను. ఆపాటలోని యర్థమిది.

'ఒక కట్టెలవాడడవిలోఁ జెట్టు నరకుచుండెను. మఱొక చెట్టుకొమ్మ యతని తలమీద రెమ్మలానించి

గాలి వినరుచుండెను. అతనికి చీదరయెక్కి విసుగుకొని యాకొమ్మను నరకివేసెను."

అతనిని రెండుమాసములు ఖైదులో నుంచిరి. తరువాత జామీను మీాద విడుదలచేసిరి. మా దేశములో ఖైదు లనగా మీారెఱుగుదురుకదా! ఖైదులోనుండి బయటకు వచ్చిన తరువాత హిమిఖయ్ అస్థిపంజరమై పోయెను. అతనికి క్షయవ్యాధి కలిగెను. అతడు ప్రతిదినము సాయంకాలమున నెత్తురు గ్రక్కుకొనుచుండెను. అతడు రెండు నెలలు తీసికొని యొకనాడు చనిపోయెను. చివరి దినములలో నతడు వ్రాసిన గీతములు మాజాతి నంతయు నుద్ధరించుచున్నవని యురిఖిలా కన్నులు పెద్దవిచేసి ఇటురీ నీటిమీాదఁ జూచుచుండెను. నేను 'ఉరిఖిలా! హిమిఖయ్ కవిత్వము నాకు మఱియు వినవలయునని యున్నది. ఆతడు చివరిరోజులలో వ్రాసెనంటివే, అది యొక గీతమును బాడగలవా' యంటిని.

ఉరిఖిలా కన్నులలోనికి నీళ్ళు వచ్చెను.

ఇటరి, ఇటరి
ఒత్తిడి పొందకోయ్
నెత్తురు గ్రక్కకోయ్
ఇటరి, ఇటరి.
కొండఖైదును వదలి
పిండునీరము ప్రిదిలి
ఇటరి, ఇటరి.
నా పాటలోఁ గలిసి
నాట్యమాడిన ఇటరి
ఒత్తిడి పొందకోయ్
నెత్తురు గ్రక్కకోయ్
ఇటరి, ఇటరి.

"ఈపాట యతఁ డొకనాడు సాయంవేళ నెత్తురు గ్రక్కుకొని ఇటురీ నదివంకఁ జూచుచు గానము చేసెను" నేను మనస్సులో హిమిఖయ్ యెంత సుకుమారకవి యనుకొంటిని. ఉరిఖిలా మరల నిట్లు చెప్పెను. "ఇందాక నేను నిలుచుండి పూజచేసినచోట హిమిఖయిని తగులబెట్టినాము. ఆదారివెంటఁ బోవుచున్నపుడు నీగ్రో యైన ప్రతివాడును హిమిఖయియందు దన గౌరవము ప్రకటించి పోవలయును. హిమిఖయి శరీరము మాత్రము మట్టిలో గలసిపోయినది. అతని యాత్మ కాంగోనదిలో పోయి మరల గలసికొన్నది.

హిమిఖయ్ చనిపోయిన తరువాత నీగ్రోజాతిమీాద పాలకు లెక్కువ పగ సాధంచ నారంభించిరి. మా పూజలు, మా యాచారములు, సర్వము నెడల విరోధ భావ మెక్కువైనది. హిమిఖయ్ అన్నచో ద్వేషము వెల్లడించిన మావారి కతని గొప్పదన మిప్పుడు తెలియుచున్నది. హిమిఖయ్ కాంగోనదిమీాద నొకపాట వ్రాసెను. ఆపాట యిప్పుడు ప్రతినీగ్రోయును బరుండక ముందొకసారి పాడుకొనిగాని నిదురపోడు."

నే నాపాట పాడుచుంటిని.

మెఱికలపై దూకే కాంగో
మిట్టలపై నురికే కాంగో
రాళ్ళులపై గదలే కాంగో
బుడగలుగాఁ గట్టే కాంగో
నల్లని దేహావు కాంగో
తెల్లని బుడగల కాంగో
పడవలు విరిచే కాంగో
కడవలు నించే కాంగో
కమ్మని పాటల కాంగో
జిమ్మని చలికల కాంగో
నీగ్రో కాంగో, నీగ్రో కాంగో
చావని కాంగో, చావని కాంగో
నల్లని కాంగో, నల్లని కాంగో
మిట్టల దూకే కాంగో
మెఱికల ఉరికే కాంగో.

నే నీ విచిత్రమైన కవితాఫక్కిలో గల యొక విచిత్రమైన వ్యంగ్యభావమును జూచి యాశ్చర్యపోతిని. ఉరిఖిలాయును నేనును బయలుదేరితిమి. ఉరిఖిలా తన పల్లెటూరికి నన్ను రమ్మని యాహ్వానము చేసెను. ఇరువురము పోవుచుంటిమి. అడవిలోఁ బడి నడచుచుండగా నొక రొకరము మాటాడుకొనలేదు. కొంత దూరము

పోయిన తరువాత జీకటి పడినది. సూర్యాస్తమయము కాకముందే యడవిలో జీకట్లు బలిసినవి. ఉరిఖిలా ప్రక్కనున్నంతవఱకు నాకడవి జంతువులవలని భయము లేదు. చీకట్లు బాగుగా ముసరినవి. ఉరిఖిలా పల్లె మఱి రెండు మైళ్లదూర మున్నది. దారిలో నొక చిన్న చెఱు వున్నది. దానిపై నొక పిట్ట సన్నని కూత కూసినది. ఆధ్వని వినినంతనే యురిఖిలా,

"కివు ఖై కి సాలికా
కివు ఖై కి సాలికా
ఉరిరి కిఱు కొరితె
కుయ్ ఖొలితె కి సాలికా"

అని గంతులు వేయ నారంభించెను. ఉరిఖిలాకు డబ్బదైదేండ్లు వయసుండ వచ్చును. అతడు లేడిపిల్ల వలె చెంగుచెంగున దూక నారంభించెను. నే నతని నందుకొన లేక పోతిని. నేను దూరమునుండి యురిఖిలా యని కేకపెట్టి పిలచితిని. అతడు నాదగ్గరకు మరల దుముకుచు వచ్చి వగలబడి నవ్వెను. చేయి యాకాశము వంకకు జూపించి యొక యాల వేసి

'కివు ఖై కి సాలికా
కివు ఖై కి సాలికా'

యని యఱచెను.

అతని పల్లెకు గాళ్ళత్రోవ దూరము. దట్టమైన యడవిలో నుండి దగ్గరత్రోవ యున్నది. అత డాత్రోవ తీసెను. కొంతదూరము పోవునరికి భొంయి మని పెద్ద ధ్వని వినిపించెను. ఒక వందమంది జనము పెద్దగా నఱచుచుండిరి. ఉరిఖిలా నది యేమిటని యడిగితిని. అత డిట్లు చెప్పెను. అచటికి దగ్గరలో ఇటురీ నదిలో గలియు నొక పెద్ద వాగుండెను. అది యానమీపమున పెద్ద తటాకము కట్టి మిక్కిలి లోతుగా నుండును. అందు మొసళ్లు, నీటిగుఱ్ఱములు నివసించుచుండును. నీటిగుఱ్ఱమును వేటాడుట మిక్కిలి భయంకరమైన విషయము. నీగ్రోజాతివా రుచ్చులు పోసి పొదలవెనుక దాగియుండి యా యుచ్చులు నీటిగుఱ్ఱము కాళులకు దగిలించి బిగించి, దానిని వెలికిలద్రోసి వలలలో దానిని సంగ్రహింతురు. అది బెదరిపోయెనా నీగ్రోల పండఱను విఱుగ ద్రొక్కును. దాని దీర్ఘదంష్ట్రిల నడుమ కనబిన నమలి వేయును. దానిని వేటాడుట మహాకార్యము. ఉరిఖిలా తన పల్లెవారు నీటిగుఱ్ఱమును బట్టుకొని యుండిరని చెప్పెను. నేనది చూడవలయు నంటిని. మే మిద్దర మచ్చటికి బోతిమి. వంద కాగడాల వెలుగులో వెల్లకిల పడి చావు బ్రదుకుల మధ్య నున్న యామహాజంతువు పడి యుండెను. అన్ని వైపుల వలలు పట్టుకొన్నవారు, దాని కాళులకు బిగించిన పగ్గములు పట్టుకొన్నవారు నా జంతువును గదలకుండ జేయుచుండిరి.

రాత్రి రెండు జాములకు ఉరిఖిలా పల్లె చేరితిమి. రాతిరి నిగురపోవుచు ఉరిఖిలా హిషిఖయ్ వ్రాసిన కాంగోపాట పాడి నిదురించెను.

---

## "హఠాత్తుగా లభించిన జాబు"

కాఖూరి వేంకటరామారావుగారు

[వేసవికాలపు రోజు లవడంచేత తాపము బహుతీవ్రంగా ఉంది. గాడుపులకి జడిసి ప్రజలు వీధి మొహం చూపలేకుండా ఉన్నారు. పన్నెండు గంటలు దాటిపోయింది.

భోంచేసి పడకగదిలో కొన్సేపు విశ్రమిద్దామని మంచంమీద శరీరం వాల్చాను. ఇంతలో వీధితలుపును ఎవరో తట్టినట్లుగా వినబడ్డాది. మా అబ్బాయిని పిలిచి "ఎవరో చూడమ్మా" అని చెప్పాను. మరిరెండు నిముషాలకి ఒక కవరు ఉత్తరాన్ని నా చేతికిచ్చి "ఎవరో అబ్బి దీన్ని మీకిమ్మని చెప్పివెళ్లిపోయాడు." అని మాకుర్రవాడు చెప్పాడు.

కవరు విప్పగానే అందులో రెండు ఉత్తరాలు నాకు కనబడ్డాయి! వాటిలో ఒకటినాకు రాయబడిఉంది. దానిలో సంగతులనుబట్టి అది ఒక తెలగా యువకుడు రాసినజాబని స్పష్టపడుతూంది. అడుగున పూర్తిసంతకంలేదు. "గో. రం" అని రెండు పొడిఅక్షరాలు మాత్రం అర్థంతెలియనివి ఉన్నాయి. అందుచేత అతడెవరో నేటికీ నాకు బోధపడడంలేదు.

రెండో ఉత్తరం ఆయువకుని తండ్రికి సంబంధించినదైఉంది. తన జీవితంలో జరిగిన ఒక విశేష సంఘటనాన్ని వర్ణిస్తూ అతని జనకుడు రాసినలేఖ అది. దాన్ని చదవుతూన్నకొద్దీ విషయగౌరవాన్నిబట్టి

అందులోని వృత్తాంతాన్ని పూర్తిగా తెలుసుకోవాలనే ఆతురత నాలో అధికమై పోతూఉండేది. మధ్య నొకమారు మా ఆవిడ గదిలో ప్రవేశించి తమలపాకులమాట యెత్తేసరికి చదువుతూ ఉండగా అడ్డువచ్చిందని చిరాకుపడ్డాను కూడాను. కాబట్టి విశేష ఉపోద్ఘాతం లేకుండా ఆతెలగాయువకుడు నన్ను తనజాబులో కోరినట్లు లేఖలను రెంటినీకూడా ఇందుమూలంగా ప్రకటిస్తున్నాను. ముందు నాకు రాసిన ఉత్తరాన్ని చదివితేగాని విషయం సులభం కాదు కనుక మొదట దాన్నే వివరిస్తున్నాను.]

౧

## నా పేరనున్న జాబు

"సహృదయ మహాశయా! నమస్కారములు.

"తమరు నన్నెరగరు. కాని పత్రికలలోని తమ వ్యాసాలమూలాన్ని మీరునాకు చిరపరిచితులే. ఈ లేఖల మూలంగా నేను వెల్లడించబోయే విషయము తమబోటి విశాలహృదయులు వినతగినదిగా తోచి, ముఖపరిచయము లేనప్పటికీ తమ కిల్లాజాబురాయ సాహసించినందుకు క్షమించ ప్రార్థన.

"ఇందులోని విషయం పూర్తిగా మానాన్నగారికి సంబంధించినది. నాకు పన్నెండోయేట ఆయన వ్యవసాయం నిమిత్తమై మన్యం వెళ్ళారు. అటునుంచి వచ్చినతరువాతనించీ ఆయన ప్రవర్తన పూర్తిగా మారిపోయి నాకుగూడా ఆశ్చర్యం కలిగించేది. మనసు కలిసిన స్నేహితులకైనా ఆయనప్రకారం అర్థమయేదికాదు. "అనవ్వా, అచలాకీ. అన్నీ ఏమైపోయాయో? మన్యంలో కోయముండా కొడుకులేమేనా మూలికా ప్రయోగం చేశారేమో అని మా అనుమానం" అని వారు మా నాన్నగారు చనిపోయిన తరువాతరోజుల్లో మా సావిట్లో కూచుని గతించిన మిత్రునిగురించి విచారంతో అనుకుంటూ ఉండేవారు. "నేను పుట్టిన ఏడాదిలోపుగానే మా తల్లి చచ్చిపోయింది. మాతృప్రేమ ఎలాంటిదో ఎరగని నిర్భాగ్యపు జన్మనాది. ఆమె మరణించేటప్పటికి వివాహయోగ్యమగు వయస్సు దాటిపోలేదు మా నాన్నకి. కాని ఆయన మరి పెళ్లి చేసుకోలేదు.

"రాజమహేంద్రవరంలోని తెలగాలలోకల్లా మా తాతగారిదే పెద్దభవంతి. ఆయనకి మా అమ్మ ఒక్కర్తె కుమార్తె అవడంచేత మా నాన్నని ఇల్లరికం తెచ్చుకొన్నారు. అత్తమామలకి అల్లుడూ, కొడుకూ తనేఅయి మా నాన్న తిరిగారని నేటికీ మా బంధువులంతా చెప్పుకుంటారు.

"మన్యం వెళ్లిపోయిన తరువాత ప్రతి రెణ్ణెల్లకీ, మూడునెల్లకీ మా నాన్న రాజమహేంద్రవరం వస్తూ ఉండేవారు. క్రమేపీ తరచు రావడం మానేసి ఏడాదికోసారివచ్చి పదిరోజులుండి మళ్ళా వెళ్లిపోయేవారు. ఇంకో పదిరోజులుండమని మా అమ్మమ్మ బలవంత పెట్టడం ఏదోసాకుచెప్పి ఆయన వెళ్లిపోతూవుండడం నాకు బాగా జ్ఞాపకం.

"చిన్నయ్యని ఒక్కణ్ణే ఆయన తనతోకూడా మన్యం వ్యవసాయానికి తీసుకెళ్ళారు. రెండుతరాలనించీ మా తాతగారిల్లు కనిపెట్టుకునిఉన్న నౌఖరు చిన్నయ్య. మా తాతగారికి బోలెడంత కలప వర్తకం ఉండేది. మన్యాలలో తిరగడం, కలప బేరంచెయ్యడం, అమ్మడం అంతా చిన్నయ్యదే పని. చిన్నయ్య అంటే అంతనమ్మకం ఇంట్లో అందరికీని. అందుచేత మా అమ్మమ్మ వాణ్ణే మా నాన్నతో పంపించింది.

"అసలు చిన్నయ్యకి సంతానంలేదు. కాని మన్యంవెళ్లిన మూడు నాలుగేళ్ళకి వాడికొక కొడుకుపుట్టినట్లు మాకు తెలిసింది. మొదట వెళ్లడ మేమిటో అంతేగాని మళ్లా ఆఖరుసారి పూర్తిగా మన్యం నించి మకాం యెత్తేసే వరకూ చిన్నయ్య రాజమండ్రి గుమ్మం తొక్కలేదు.

"రాజమహేంద్రవరం వచ్చేసరికి చిన్నయ్యకొడుకు చంద్రయ్యకి రెండోయేడు. చూడ్డానికి ముచ్చటగా ఉండేవాడు. చిన్నయ్య అప్పటికి బాగా వృద్ధుడైపోయాడు. యావజ్జీవమూ మా సేవలోనే గడిపినవాడవడంచేత ఏపనీ చెయ్యలేనప్పటికీ వాడికుటుంబఖర్చు మేమే భరించేవాళ్లం.

"అదేమొదలు మానాన్నలో ఈవింత ప్రవర్తనకి. అసలు మన్యంలోనే ఈ లక్షణాలు కనబడ్డాయట కాని అక్కడ అంత తీవ్రంగా ఉండేవి కావని చిన్నయ్య చెప్పేవాడు. కారణం తనకీ తెలియదనే వాడిగోల.

"ఇంతగొడవతో మీకు విసుగెత్తిస్తున్నాను కాబోలు! ఆర్యా! క్షమించాలి. ఇంతవరకూ చెప్పకపోతే విషయం విశదంగా తెలియదు. మానాన్న లోని ఈమార్పు ఏమిటో తెలుసుకోవాలని మీరు తొందరపడుతూ ఉండవచ్చును. మార్పు అంటే మనిషి యథాప్రకారం తెలివితేటలుగానే ఉండేవారు. కాని ఎప్పుడూ పరధ్యానంగా ఏదో ఆలోచనే. పూర్వపు సంతోషం ఆయనలో నుండి పూర్తిగా పోయింది. వ్యవహారాలన్నీ స్వయంగా చూసుకునేవారు. కాని అత్యవసరములైన పనులుంటేనేగాని స్నేహితులకైనా దర్శనం దొరకేదికాదు.

"ఎప్పుడూ మేడవసారాలోనే ఉనికి. ఇంక పచార్లుచెయ్యడం మొదలిడితే సాయంత్రందాకా ఏకపచారే. కుర్చీలో కూచుని ఆలోచన ప్రారంభిస్తే ఆ ఆలోచనకి అంతమేలేదు. ఎవరేనావచ్చి పిలిచేవరకూ అదే ఆలోచన. అదేమిటో, దేన్నిగురించో తెలిసేది కాదు ఎవరికీగూడాను. ఇంట్లో నాతోనేకాదు, అమ్మమ్మతోనేకాదు ఎవరితోనైనాసరే ముక్తసరిగా మూడుమాటలే. యుక్తవయస్సు వచ్చిన కుమారుడను నాతో అసలు మాట్లాడకుండానే రోజులకి రోజులు గడిచిపోయేవి.

"ఒక్కొక్కపుడు అర్ధరాత్రివేళ చూసేవాణ్ణి. మేడవసారాలో అటూ ఇటూ తిరుగుతూ కనబడేవారు. తెల్లవారే వరకూ ఆయన అల్లా తిరుగుతూనే ఉండేవారు. అల్లాంటి రాత్రు లెన్నో

చేసారుగుదును. కొన్నిసమయాల్లో కన్నీటితోనూ, నిట్టూర్పులతోనూ రోజు అంతా గడిపేసేవారు. మా అమ్మపోయిన తరవాతనైనా ఆయన అంతగా విచారించేవారు కారట.

"ఒకనాడు తెల్లవారుజాము మూడుగంటలప్పుడు నాకు మెలకువ వచ్చింది. అంతటా గాఢనిశ్శబ్దం నిండిఉంది. ప్రపంచమంతా అంధకార ముద్రితమై ఉంది. మామూలు ప్రకారమే నాన్నగారేం చేస్తున్నారో చూడ్డానికి మేడవసారాలోకి తలయెత్తాను.

"అగాధ నిశ్శబ్దమునుంచి మా నాన్న మూలుగు స్పష్టంగా వినబడుతూంది. మనసులోని ఆతురతను అణుచుకోలేక నేనింకా సమీపంగా వెళ్లి చూస్తూ నిలుచున్నాను. చిన్నయ్య ఆయనని ఓదారుస్తున్నాడు. వారి మాటలు పూర్తిగా నాకు వినబడేవికావు గాని "చిన్నయ్యా! ఇంక నేను మరిచిపోలేను. నన్నెందుకు ఓదారుస్తావు?" అని మా నాన్న అన్నమాటలు మాత్రం స్పష్టంగా వినబడ్డాయి.

"నాకారాత్రి మరి నిద్రలేదు. నాన్నస్థితిచూసి నాకెవరకే బాధగా ఉండేది. ఆరాత్రి ఆయన మాటలకర్థం తెలియక నేనెంతో కొట్టుకున్నాను ఆయనబాధ తెలుసుకుని తగినసేవ చెయ్యాలని ఎంతో ప్రయత్నించాను. సంగతి ఏమిటో చెప్పమని చిన్నయ్యను ఎన్నిసార్లడిగినా వాడు "బాబూ! క్షమించండి. చెప్పడానికి నాకు ధైర్యం చాలదు." అనడంతప్ప రెండోమాట ఆడేవాడు కాడు.

"ఇంతలో చిన్నయ్య చనిపోయాడు. వాడిచావుతో ఆయనకి బాధ మరింత ఎక్కువైపోయింది.

"ఇల్లా రెండు మూడేళ్లు జరిగిన తరవాత రోజుకి రోజూ క్షీణించిపోయి మా నాన్నగారు మరణావస్థను సమీపించారు. ఇంక రెండు రోజులకి చనిపోతారనగా ఆయన నన్ను పిలిచారు. ఎన్నడూ నన్ను అలాపిలవడం మామూలాయనకిలేదు. అలాగని నామీద కోపం చూపించేవారని నేనుచెప్పను. నాఖర్చుకి కావలసినంత డబ్బిచ్చేవారు. క్రమంగా ఇంటిపెత్తనమంతా నామీదే వదిలిపెట్టేశారు. కాని సేవచెయ్యాలని దగ్గిరకెళితే మాత్రం ఒప్పుకునేవారుకారు.

"నన్ను తనకి సమీపంగా మంచంమీద కూర్చోమని ఆయన మెల్లిగా చెప్పడం ప్రారంభించారు "అబ్బాయీ! నాకు చావు సమీపించింది. నువ్వు ప్రాజ్ఞుడివైనావు. నీకు ఉపదేశించవలసిన విశేషజ్ఞానం నాదగ్గిరలేదు. కుటుంబ వ్యవహారాలన్నీ నీకు తెలిసినవే. నాకు సేవచెయ్యాలని నీవుపొందే ఆతురతచూసి నీపితృభక్తికి నేను చాలా సంతోషించాను. మీ సేవలునాకు ఆత్మశాంతి నివ్వలేవని మిమ్మల్ని వద్దనేవాణ్ణి కాని వేరేకారణంలేదు. పితృభక్తి పరులకి కలిగే శుభాలు నీకు కలుగుతాయి. సందేహంలేదు. ఇదుగో. ఈ కవరు నువ్వు తీసుకుని భద్రపరుచుకో. అందులో నామనోవ్యథకి గల కారణాలు వివరింపబడిఉన్నాయి. నే నీలోకాన్ని విడిచిపెట్టిన తరవాత కాని దీన్ని నీవు విప్పవద్దు. అందులో నేను రాసినట్లుగా నడుచుకోవలసి ఉందినువ్వు. అల్లా నువ్వు వాగ్దానంచేస్తే చాలు నాకింకే విచారమూ ఉండదు."

"ఆయనకోరిక ప్రకారం నేను ప్రమాణం చేశాను."

* * * * *

"మా నాన్నగారిహలోకాన్ని విడిచిపెట్టేశారు. విచారపుదినాలు గడిచిపోయాయి. వచ్చిన బంధువులంతా ఒక్కొక్కరే వెళ్లిపోయారు.

"ఆర్యా! ప్రతిక్షణమూ మా నాన్నగారిచ్చిన జాబు చూడాలని నామనస్సు తొందరపడుతూనే ఉండేదని మీకు నేను వేరే మనవి చెయ్యనక్కరలేదు. కాని శ్రాద్ధవిధులన్నీ ముగిసినతర్వాతగాని నాకు తగిన మనశ్శాంతి చిక్కలేదు.

"ఒకనాటి రాత్రి అందరూ పడుకున్న తరవాత మేడమీద గదిలో ఒక్కకిరోసినుదీపం పెద్దదిగా చేసి మా నాన్నగారి జాబును చదవాలని తీశాను. ఆ ఉత్తరాన్ని మూసేసరికి నాశరీరం వణికిపోయింది. అందులో ఎల్లాంటి రహస్యం ఉంటుందో అని నాహృదయం కొట్టుకుంది.

"ఉత్తరమంతా మా నాన్నగారి స్వహస్తూరీతిలోనే ఉంది. ఆ అక్షరాలవేపు చూస్తూఉండేసరికి ఆయనపడే మనోవేదనా మొదలైనవన్నీ తలపుకివచ్చి అప్రయత్నంగానే నాకను లశ్రుపూరితములైనవి. బాధానూచకమైన ముఖంతో మా నాన్నగారు నాదృష్టిపథాన్ని నిలిచారు. నా శరీరం జలదరించి పోయింది.

"మరి అయిదు నిముషాలకు కొంత ధైర్యం తెచ్చుకుని జాబును చదవడం ప్రారంభించాను. చదివేటప్పుడు నాభావాలు ఎలా గుండెనో చెప్పబూనడం లాభంలేదు. ఆ ఉత్తరాన్ని ఇందుతో మీకు పంపిస్తున్నానుగనుక మీరే ఊహించుకోవడం మంచిదని నా అభిప్రాయము.

"మహాశయా! నాన్నగారి జీవిత చరిత్రలో ఏదెన్నీ ప్రమాణం ఒకదివ్య సంఘటనగా నాకు తోస్తుంది. కొన్నికొన్ని సంఘటనలు మనుష్యుని జీవితముపైని ఎలాంటి ప్రబలమైన మార్పులు తీసుకొస్తాయో తెలుసుకోడానికి మా నాన్నగారి జీవితమొక ఉదాహరణంగా ఉంది. అయితే దేనియొక్క మంచిచెడ్డలుగాని దాన్ని పరిశీలించేవారి భావశైశాల్యాన్నిబట్టి ఏర్పడుతాయి. ఏ సమస్యనైనా విమర్శించాలంటే తగినంత సహృదయతలేనిదే సాగదు.

"ఆర్యా! నాన్నగారి అనుమతిపైనే ఆయన జాబును బహిరంగపరుస్తున్నాను. ఇట్టి విషాదవృత్తాంతములను సంఘీయులు తెలుసుకొని ఉండడం మంచిదని నమ్మి తన జీవితములోని ముఖ్యఘట్టములను తెలియచేసే తనజాబును ప్రకటించమని ఆయన అందులోనే నన్ను కోరినారు. ఆయన అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

తమకు తోచినరీతిని ఈలేఖలను రెండింటినీగాని, ఒక్క దానినేగాని మీయిష్టమువచ్చిన పత్రికయందు ప్రకటించుడుగాక అని ప్రార్థిస్తున్నాను. తమరు పత్రికా విలేఖకులని ఎరుగుదును. తమ వ్యాసాలయందు విశేష గౌరవం కలవాడను. కనుక తమ ద్వారా ఈజాబులను ప్రకటించడం నాఅభిప్రాయము. శ్రమయిచ్చినందుకు క్షమింతురని నమ్ముతున్నాను.

"చిత్తగించవలెను
"గో—రం—"

3

పైజాబుతోపాటు ఆయువకుడు "మా నాన్నగారిజాబు" అని పైనరాసి తండ్రి తనకు రాసిన ఉత్తరాన్ని కూడా అకవరులోనే నాకు పంపించాడు. అజాబును కూడా ఈక్రింద ప్రకటిస్తున్నాను]

"మా నాన్నగారి జాబు"

"ప్రియకుమారా!

"ప్రాజ్ఞుడవై యుక్తవయస్కుడవైన నీకు నా మనోవ్యధకుగల కారణాన్ని తెలపవలసిన బాధ్యత నాకు ఉందని ఎరుగుదును. కనుకనే ఈఉత్తరాన్ని రాస్తున్నాను.

"దీనికంతటికీ ఒకరహస్యగాధ ఉంది. దాన్ని నేను స్వయంగా నీతో చెప్పడానికి నామనస్సు ఎందుచేతనో ఒప్పుకోలేదు. నాబాధను చూసి మీరు పడే విచారాన్ని నేను చూడలేకపోతున్నాను. మామూలురీతిగా ఉండాలని ఎంతప్రయత్నించినా నాకు సాధ్యపడకుండా ఉంది. నా హృదయగతమైన విషాదాన్ని తలుచుకోకుండా ఉండలేను. అది తలుచుకున్నప్పుడల్లా నాకీబాధతప్పదు.

"ఈ నా విషాదమునకు కారణం ఎరిగినవాళ్లు నేనూ, చిన్నయ్యా తప్ప వేరొకరీ ప్రాంతంలో లేరు. మేము బతికిఉండగా ఈరహస్యాన్ని బయట పడనియ్యకూడదని ఎందుచేతనో కాని నామనస్సు కోరుతూ ఉంది. ఇందులో ప్రమాదకరమైన విషయమేమీలేదు కాని మన ప్రస్తుత సాంఘిక పరిస్థితులకిది కొంచెం వ్యతిరేకంగా ఉంటుంది. అందుచేత ప్రతివాళ్ళూ నా వేపు వేలు చూపించి ఈ విషయాన్ని చెప్పుకోవడం నేను సహించలేను. ఇలాంటి గాధలలోని పాత్రములు బతికిఉన్నప్పటికంటె చచ్చిపోయినతరవాతనే ప్రజల సానుభూతిని ఎక్కువగా పొందుతారని నానమ్మకం. కాబట్టి నా మరణానంతరమే దీనిని నీకు తెలిసేటట్టు ఏర్పాటు చేస్తున్నాను.

"ఇట్టి సంఘటనలలోబడి నలిగిపోయిన పాత్రలయెడల ప్రజలకి ఆదరబుద్ధి కలిగించడం చాలా అవసరం గనక ఈజాబును నీవు నీకు తోచినరీతిని ప్రచురణ చేయవలెనని కోరుతున్నాను. సాంఘిక దురాచారబద్ధులైన ప్రజలు కనికరము చూపించకపోవడంచేతనే మేము ఘోరబాధల ననుభవించవలసి వచ్చింది. సంఘమే ఆదరిస్తుందన్న ధైర్యం ఉంటే ఈబాధలు తప్పిపోయి ఎన్నిజీవాలు సుఖిస్తాయో చెప్పలేను. ఈ నాకథలోని వ్యక్తుల మంచిచెడ్డల విమర్శన చదువరులకి విడిచిపెట్టడమే మంచిది"

* * * * *

"కుమారా! మేము ఏజన్సీ వెళ్లినతరవాత రెండేళ్ళవరకూ ఏ విశేషమూ లేకుండానే నడిచిపోయింది. మేము బసచేసినది సాంద్రారణ్య ప్రదేశము. మహోన్నతములైన తూర్పు కనుమల శిఖరచ్ఛాయలలో మా నివాసములను నిర్మించుకున్నాం. గోదావరి మా యింటిముందునుంచే ప్రవహించేది.

"మాకు చుట్టుపక్కల రెండుమైళ్ళదూరంలో యెక్కడా ఊరుగాని పల్లెగానిలేదు. హైదరాబాదునుంచి కలప వ్యాపారానికి వచ్చిన ఒక సంపన్నుడైన తూర్పుకాపు మాత్రం మా వ్యవసాయపు లంకలకి దగ్గరగా నివసించేవాడు. అందుచేత మన బంట్రోతు చిన్నయ్య సలహాల ననుసరించి మేముకూడా ఆయన యింటిపక్కనే మా కుటీరాలను కట్టుకున్నాం. ఆ కలపవర్తకుడిపేరు అప్పలస్వామి.

"మేము కొత్తగా అక్కడికి వెళ్లినరోజుల్లో అప్పలస్వామి మాకు చాలా సహాయం చేస్తూ ఉండేవాడు. కోయవాళ్లలో విశేష పలుకుబడి కలవాడవడంచేత అతడు మాకు కావలసిన నాలికాపులను, నౌకర్లను సప్లయిచేశాడు. కొత్తప్రదేశంలో అతని సహాయం మాకు అమూల్యమై కనబడేది. సమీపంలో నాగరికులెవ్వరి సహవాసము లేనందున మా యిద్దరికీ గాఢమైన మైత్రి కలిగింది.

"అప్పలస్వామి ఆప్రాంతాలకివచ్చి అప్పటికే పది సంవత్సరాలైంది. కలపవర్తకం వల్ల విశేష ధనాన్ని కతోడు పలుకుబడిని కూడా అతడు సంపాదించుకున్నాడు. అతడా అరణ్యంలోనే చక్కని బంగాళా ఒకటి నిర్మించుకుని సుఖజీవనం చేస్తున్నాడు. నైజాం రాష్ట్రంలో అతనికి గొప్ప గొప్ప హోదాలుకల బంధువులున్నారు.

"అతని బంగాళా చుట్టూ పదికొంపలు కట్టుకుని అతని నౌకర్లూ, గుమాస్తాలూ నివసించేవారు. వాటిపక్కనే నేనొక విశాలమైన పూరిఇంటిని కట్టాను. నాయింటి వెనకభాగంలో చిన్నయ్య ఇల్లుండేది. మాకు నిత్యమూ అవసరమైన నౌకర్లను ఒకరిద్దరు నాలికాపులను చిన్నయ్యయింటికి సమీపంలోనే గుడిసెలు కట్టుకుని ఉండేవారు. నేను చిన్నయ్య ఇంట్లోనే భోజనం చేసేవాడిని. చిన్నయ్య భార్య ఆడెమ్మ నాకు తల్లిలాగ సంరక్షణ చేసేది.

"మా ఇంటికెదురుగుండా అరమైలు దూరంలో గోదావరీ గర్భంలో మా వ్యవసాయపు లంకలు కనబడుతూ ఉండేవి. చిన్నయ్య బహుశ్రద్ధగా వ్యవసాయం చూసుకునేవాడు కనుక నేనట్టే తరుచుగా లంకలోకి వెళ్ళనవసరం లేకపోయేది. బాగా సరదా పుట్టినరోజుని ఎప్పుడేనా అప్పలస్వామితో కలిసి షికారుగా లంకలోకి వెళ్ళేవాణ్ణి.

"సాధారణంగా ఉదయాన్నే భోంచేసి మన్యంలోని అంతర్భాగములకుపోయి వ్యవహారం చూసుకుని సాయంకాలానికి ఇంటికొస్తూఉండడం అప్పలస్వామికి మామూలు. ఒకొక్కప్పు

డింకాదూరం వెళ్ళాడంటే తిరిగి వచ్చేసరికి మూడు నాలుగు రోజులు కూడా పట్టేది. అల్లాంటప్పుడు నాకు ఇంటిదగ్గిరఏమీ తోచేది కాదు. ఇంటివద్ద ఉన్న ప్రతిఘడియా మేమిద్దరమూ ఒక్కచోటనే గడిపేవాళ్లము.

"అప్పలస్వామి సహజౌదార్య స్వభావుడగుటచేతనూ, సమీపంలో రెండో సహవాసం లేకపోవడం చేతనూ మా మైత్రి దినదినాభివృద్ధిని పొందినది. కాని అతడు కొంచెం పూర్వకాలపురకంమనిషి. అందుచేత నేనతిన్ని భోజనానికి అప్పుడప్పుడు మాయింటికి పిలుస్తే ఏదో కారణం చెప్పి తప్పించుకునేవాడు. కాని ఏదైనా ఫలహారాల మట్టుకి మాకు అభ్యంతరాలు ఉండేవికావు. లంకలోనించి వచ్చే ఊచబియ్యమూ పుచ్చకాయలూ మొదలైన వాటికి అతను మాకు అతిథి, మన్యంనుండివచ్చే పళ్ళూ తేనే మొదలైనవాటికి నేను వారి అతిథిని. "నాలకీ పళ్లకీలేని అభ్యంతరాలు భోజనానికి మాత్రం ఎందుకయ్యా?" అని నేను నవ్వుతూ ఒకనాడు అన్నాను.

"న్యాయానికి అలాటి అభ్యంతరాలు ఉండకూడదు. కాని ఈ వేపున మా తూర్పుకాపుల్లో అల్లాంటి దరిద్రపు కట్టుబాట్లు కొన్ని ఉన్నాయి. వీటిని ఉల్లంఘించడానికి బలీయమైన సంఘ బహిష్కారానికి జడియక తీరదు. తూర్పు దేశాన్ని మాలో ఇంత బాధలులేవు. మావాళ్లు తక్కువగా ఉన్న ఈదూరదేశంలో సంఘీయుల సహాయం లేకపోతే అసలే బతకడం కష్టం." అని అతడు జవాబిచ్చాడు.

"అతని జవాబులెప్పుడూ ఇలాగే గోడమీది పిల్లివాటంగా ఉండేవి. అసలు సంస్కారాభిమానము కలవాడే; కాని ఆచరణలో పెట్టడానికి మాత్రం భయం పోలేదంతఉంది. ఎవరెల్లాపోతే నాకేమని ఊరుకునే అలసభావము అతనిలో బహుయెక్కువ."

౪

"మా నివాసస్థానమునకు సమీపాన్ని ఉన్న కొండశిఖరాల్లో చాలా వాటిమీద కోటలూ, రక్షకభట స్థానములూ, దేవాలయములూ మొదలైన ఆంధ్రరాజుల పురాతనపు కట్టడములెన్నో ఉన్నాయి. శిథిలావస్థలో ఉండి కూడా నిర్మాతల ఔన్నత్యాన్ని చాటుతూ ఆ మహోన్నతస్థానములందు శీతవాత వర్షాతపములను లక్ష్యపెట్టక అవి నేటికీ నిల్చి ఉన్నాయి."

"చిన్నప్పటినుంచీ నాకు పురాతన సంస్థలంటే భక్తి ఎక్కువ. రాజమహేంద్రవరంలో ఉన్నప్పుడే తరుచు సారంగధరుడి మెట్ట మీదకీ, రాజరాజనరేంద్రుని కోట బురుజుల మీదకీ వెళ్లి చాళుక్య వంశీయుల చరిత్రను మననం చేసుకుంటూ కూచోడం నాకు మామూలు. అందుచే తీరుబాటు సమయాల్లో అప్పలస్వామితో కూడా చుట్టుపక్కల ఉన్న చారిత్రిక ప్రాముఖ్యతగల స్థలాలకు పోతూ ఉండేవాణ్ణి.

"శత్రువుల జాడలను కనిపెట్టడానికి అపర్వతశిఖరాలమీద కట్టించిన బలిష్ఠములగు పహారాలను (Watch Posts) దర్శించి తన్నిర్మాతలగు ఆంధ్రభూపాలుర వైభవాన్ని గురించి అప్పలస్వామితో ముచ్చటించేటప్పుడు వారియెడలగల గౌరవభావముచేత నా శరీరం గగుర్పొడిచేది. నా ఉపన్యాసాలను అప్పలస్వామి అతి ఆదరబుద్ధితో వినేవాడు.

"ఒకనాడు నేనూ, అప్పలస్వామీ కలిసి "రామవరపుదుర్గము" అనే కొండకోటను చూడ్డానికి బయలుదేరాం. గద్దుమన్యాల్లో ఒక పర్వతం మీద కట్టబడిన కోట అది. ఆప్రయాణం పూర్తిచేసుకుని వచ్చేసరికి మాకు అయిదురోజులు పట్టింది.

"ఇంటికి రాగానే అత్యవసరములైన పనులు కనిపెట్టుకుని ఉన్నందున అప్పలస్వామి మళ్ళా దుమ్ముగూడెం ప్రాంతాలకు వెళ్లిపోయాడు. ఆనాటి మధ్యాహ్నము ఏమీ తోచక ఏదైనా చదువుకుందామని బల్లదగ్గిర కుర్చీలో కూచున్నాను. నేను బల్లమీద ఉంచిన నవలల్లో రెండు నాకు కనబడలేదు. వాని కోసమని ఇల్లంతా గాలించినా దొరకలేదు.

"అప్పుడు నేను చిన్నయ్యభార్యను పిలిచి" ఆచెమ్మా! ఇక్కడ రెండుపుస్తకాలుండాలి ఎరుగుదువా ?" అని అడిగాను.

"బాబూ! మరచిపోయాను. అప్పలస్వామిగారిచెల్లెలు సత్యవతమ్మగారు మొన్న మనయింటికొచ్చి నాతో మాటాడుతూ ఒక గంటసేపు కూచుంది లెండి. ఆమె కొంచెం చదువుకుం దట. అందుచేత ఆ రెండుపుస్తకాలనీ తీసుకెళ్లింది. పాపం! బహు మొహమాటం మనిషి. పుస్తకాలు తీసుకెళ్లడాని కెంతో సందేహించింది సుమండి. పరవాలేదని నేనెంతో చెప్పినమీదటగాని పట్టుకెళ్లలేదు. మళ్ళీ మీరు రాకముందే పంపించేస్తానని చెప్పింది. పాపం మరిచిపోయిందికాబోలు! సాయంకాలం నేనే తెస్తానులెండి." అని ఆ చెమ్మ అన్నది.

"అలాగా! పోనీలే. ఆవిడ చదువుకుంటూ ఉంటే తొందరపెట్టకు. పూర్తికానిచ్చి తేవచ్చును" అని నే ననేశాను.

"అంతట కొన్నిరోజులు గడిచిపోయాయి. నేనా విషయాన్ని పూర్తిగా మరిచిపోయాను. ఒకనాడు ఉదయాన్నే ఏదో మాట్లాడవలసినపని ఉందని అప్పలస్వామి నన్ను పిలిచాడు. మేమల్లా మాట్లాడుతూ ఉండగానే ఎనిమిదిగంటల పొద్దెక్కింది. అందుచేత "కాఫీ ఇక్కడే పుచ్చుకోండి. చాలవేళయింది" అని అప్పలస్వామి నన్ను బలవంతపెట్టాడు. నేనందుకు సమ్మతించినపిమ్మట అతడు మేము కూర్చున్న సావిడికీ ఇంటిలోపలి భాగానికీ మధ్యనున్న తెరను కొంచెం తొలగించి "సత్యవతీ! మేమిద్దరమూ కాఫీ ఇక్కడే సావిట్లో పుచ్చుకుంటాము" అని చెప్పి మళ్ళా నాదగ్గిరకొచ్చి కూర్చున్నాడు.

"సత్యవతీ ? అని అతడు పిలవడంతోటే పూర్తిగా మరిచిపోయిన విషయమేదో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చినట్లయింది నాకు. సత్యవతి

పుస్తకం పట్టుకెళ్లిన సంగతి విస్మృతిపథాన్ని పడిపోయింది. కాని అన్నగారి పిలుపుతో తిరిగీ జ్ఞాపకానికి వచ్చింది. 'అవిడ కొంచెం చదువుకుందిట' అని అదెమ్మ అన్నమాటలు తళుక్కున నామనోవీధిని మెరిశాయి.

"అందుచేత 'అచదువుకున్న అవిడ' యెలాగుంటుందో చూడాలనే కోరిక నాకప్పుడు కలిగింది. కేవలం మానవసహజమైన చూడాలన్నకోరిక (Curiosity) యేకాని వేరే భావమేదీ నాలో లేదని నేను స్పష్టంగా చెప్పగలను. కాని ఆమెను చూడ్డం ఎల్లా సాధ్యపడుతుంది? ఆ యింట్లో వాళ్లెవ్వరూ పైకిరారు. ఇంతయెందుకూ? నేను వచ్చిన ఈ రెండేళ్లలోనూ ఆ యింటి స్త్రీలెవ్వరూ నాకంటబడలేదు. అందుచేత నా అభిలాష యెంతనిరపాయకరమైనదైనా సాధ్యంకాదు కదా అనుకుంటూ అలాగే వూరుకున్నాను"

* * * * *

"ఒకనాడు అదెమ్మని పిలిచి మాటలసందర్భంలో అప్పలస్వామి ఇంటిసంగతి తిరగేశాను. అదే తడవుగా ఆమె తెలిసినంతవరకూ చెప్పేసింది. "అప్పలస్వామిగారి తల్లి వుందండి. కొంచెం ఘాటైనమనిషి. ఇంట్లో అవిడదే అధికారం. నౌఖర్లూ, చాకర్లూ అవిడ ఆధాటీకి ఆగలేక ఏడుస్తారు. పెట్టుపోతలలో కూడా అవిడ ఇలాోనారాయణమ్మే. ఎంగిలిచేత్తో కాకిని కొట్టడానికి ఒప్పుకోదు. ఇంక కోడలు నిజంగా ఇంటికి లక్ష్మీదేవి లాంటిది. అవిడ కాపురానికి వచ్చినతరవాతే అప్పలస్వామిగారికి బాగా వర్తకంలో లాభించిందని చెప్పుకుంటారు. అవిడంటే మొగుడుకి ప్రాణం. పాపం! అసత్యవతి మాటే నాకు జాలివేస్తుందండీ. బాబూ! ఆ అందమూ, తెలివితేటలూ అన్నీ అడివిగాసిన వెన్నెలై పోయింది. ఎంతమంచి మనస్సండీ అవిడది! నౌఖర్లందరికీ అవిడ అంటే ఎంతప్రేమ అనుకున్నారు? తల్లికి తెలియకుండా అవిడా, అన్నగారూ ఒకకంట చూస్తూ ఉండబట్టి కాని లేకపోతే నౌఖర్లగతి ఏం గావలసింది? అల్లాంటి రత్నంలాంటి పిల్లని దైవం చూడలేకపోయాడు. హైదరాబాదు పటాలంలో అవిడమొగుడు ఏదో గొప్ప ఉద్యోగము చేసేవాడట. ఈ అమ్మ కాపురానికెళ్లిన యేడాదికే అయనచచ్చిపోయాడట. బాబూ! అడపిల్లలను అల్లా ఉంచడం కంటె పీకనులిమేసి గోదావరిలో తోసేస్తే నయం సుమండీ."

"వయోధికురాలగు అదెమ్మ స్త్రీజనసహజమగు సానుభూతిని కనబరుస్తూ చెప్పినమాటలు విన్నపిదప నాకుకలిగిన భావాలు వర్ణించడం కంటె ఊహించుకోడానికి వదిలెయ్యడమే మేలు. సంఘదురాచారానికి బలియైపోయిన ఆ నిర్భాగ్యురాలి యందు నాకు జాలికలగడంలో ఆశ్చర్యమేముంది?

"అది మొదలు సత్యవతినిగురించి తలుచుకున్నప్పుడల్లా నాలో ఒకవిధమైన బాధకలుగుతూ ఉండేది. మేము ఇందరమూ ఉండి శుష్కసానుభూతిని చూపించడం తప్ప ఆమె దుస్థితిని మాన్పలేకపోతున్నాం కదా అనే నాబాధ. ఎవరికైనా కష్టం వచ్చిందన్నమాట వింటే చాలు పదిరోజులదాకా మరుపురాక నా మనస్సును బాధిస్తూనే ఉంటుంది. మొదటినుంచీ అలాంటి మెత్తనిహృదయమే నాది.

"ఇలాగా నాలుగునెలలు గడిచిపోయాయి. ఒకనాడు పొద్దుటే ఎనిమిదిగంటలకి భోంచేసి నేను లంకలోకి వెళ్లాను. మళ్ళా సాయంత్రం వరకూ రానని ఇంటిదగ్గిర చెప్పాను. కాని నాపని శీఘ్రకాలంలోనే అయిపోవడంచేత నేనింటికొచ్చేసరికి మధ్యాహ్నం మూడుగంటలకైనా కాలేదు.

"ఇంట్లో అదెమ్మతో ఎవరో మాట్లాడుతూన్న సడినాకు వినబడ్డాది. హాలులోకివచ్చే వరకూ నారాకను లోపలివారు గ్రహించలేదు. నన్ను చూసినవెంటనే వారిద్దరూ లేచి చటాలున గదిలోనించి పైకి వచ్చేశారు. నేను నిలుచున్నహాలులోనుండియే వారు పైకి పోవలసిఉండెను. అది గమనించి నేను సగౌరవంగా ఒకపక్కకి తప్పుకున్నాను. ముందు అదెమ్మయును, ఆమెవెనుక నొకయువతియును మెల్లగా నడిచి దొడ్డిదారిని వెళ్లిపోయారు.

"ఆయువతికి సుమారు ఇరవై సంవత్సరాలవయస్సుండవచ్చును. సరిసమానమగు ఒడ్డూ, పొడుగూ కలిగి ఆమె ఆకృతి మనోహరమై ఉండెను. ఆమెధరించిన పసుపుపచ్చని చీరయందు ఆ శరీరప్రభాయలు సమ్మిళితములై పోతున్నాయి. ముఖము సౌందర్యమధురమై, నిత్యప్రసన్నమై ఉంది. ఇంచుక సిగ్గులో తలవంచుకొని ఆమె మందగమనమున అదెమ్మ వెనువెనుకనే వెళ్లిపోయింది.

"ఆకృతినిబట్టియు, నడవడికనుబట్టియు నామె నాగరికకుటుంబములోని పిల్ల అని స్పష్టపడుతూనే ఉంది. అదెమ్మనిపిలిచి, "ఆ అమ్మాయి ఎవరు?" అని అడిగాను.

"అవిడే సత్యవతి"

౫

"అబ్బాయీ! అంతకుపూర్వం కంటె సత్యవతినిచూసిన పిమ్మటనే ఆమెను గురించిన ఆలోచనలు నాలో మరింత యెక్కువైపోయాయి. అంతటి సౌందర్యవతిని జీవితము వ్యర్థమైపోతూ ఉంటె చూస్తూ ఊరుకోవడమెలాగ? ఈ ప్రజాసమూహమంతా ఆమె దుర్గతినిచూస్తూ చీమకుట్టినట్లైనా లేకుండా ఊరుకోవడం ధర్మమేనా? అంధకారబంధురమై పోయిన ఈ ప్రపంచకంలో ఆశాజ్యోతి కొరకక అరమణీయమూర్తి నశించిపోవలసిందేనా? రాజమహేంద్రవరం లోని మిత్రులతో ఆలోచించి ఈ విషయంలో నేనేమైనా సహాయం చేసి ప్రజలదృష్టిలో కాకపోయినా భగవంతుని దృష్టిలోనైనా కృతకృత్యుడనవడానికి అభ్యంతరమేముంటుంది? రాత్రింబగళ్ళు ఇదే నా ఆలోచన.

"కాని సత్యవతిని సమీపించి కనుక్కోకుండా తొందరపడి ఏపనీ చెయ్యకూడదు కనుక అదెమ్మచేత అడిగించాలని చివరకి నిశ్చయించుకున్నాను. ఈపని చెయ్యడానికామె ఉత్సాహంతో ఒప్పుకుంది.

"అమర్నాడే ఆదెమ్మ నాదగ్గరకొచ్చి "బాబూ! నేను జాగ్రత్తగానే సంగతి కదిపిచూశాను. ఆమె ఏమీ జవాబూ చెప్పకుండా ఊరుకుంది. అట్టేతరిచి అడగడం మంచిదికాదని నేనిల్లావచ్చేశాను." అని చెప్పేసింది. ఆ మౌనముద్రను ఎల్లా అర్థం చేసుకోడానికీ పాలుపోక నేను ఊరుకోవలసి వచ్చింది.

"ఇంతలో నాకు జ్వరంవచ్చి మంచంపట్టించింది. జ్వరంవచ్చింది మొదలుకుని అప్పలస్వామి నాపక్కనే కూచుని నా సౌఖ్యం కనుక్కునేవాడు. అల్లాంటి సమయాల్లో సత్యవతి విషయం అతనితో ప్రస్తావించాలని నాలుక చివరకి వచ్చేది కాని ధైర్యంచాలేదికాదు. అంతట ఏదో ప్రయాణముపైని అప్పలస్వామి వెళ్లకతప్పిందికాదు. అస్వస్థతలో నన్ను వదిలిపెట్టి పోవడం అతనికెంతో కష్టంగా ఉండెను.

"అతడు వెళ్లిపోయింది మొదలు దగ్గరకూచుని మాటాడేవారు లేక నాకు రోజుగడిచేది కాదు. నీరసంచేత నిద్రకీ మెలకువకీ మధ్యావస్థలో పక్కమీద అలాగే కళ్లుమూసుకుని పడుకునేవాణ్ని. వ్యవసాయపు రద్దీవేళ చిన్నయ్య లంకలోకి పోయేవాడు.

"ఒకనాటి మధ్యాహ్నం మూడుగంటలు కావచ్చును. ఆరోజు ఉదయంనుంచీ ఆకాశం మేఘాలతోనిండి చలిగాలి అధికంగా ఉంది. అందుచేత శాలువ కప్పుకుని నేను పడుకున్నాను. కిటికీలపై తెరలు వాల్చబడి ఉన్నందున గదిలో వెలుతురు బహుతక్కువగా ఉంది.

"ఇంతలో ఎవరో మాట్లాడుతూ ఉన్నశబ్దం వినబడికాబోలు నాకు కొంచెం మెలుకువ వచ్చింది. కదలకుండా అలాగే రెప్పలు పైకెత్తి నేను చూశాను. గదిగుమ్మానికి అవతల సత్యవతియును ఆదెమ్మయును నిలుచున్నారు. నేను చూస్తున్నట్లు వాళ్లెరగరనుకుంటాను. నాకు నిద్రాభంగం అవుతుందేమోనని వాళ్లు బహు మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. ఆదెమ్మ "అమ్మా! జ్వరం తగ్గుతూంది కాని ఇంకా అన్నహితవు కలగడంలేదు." అన్నాది.

"అవును. ఈ నీరసం తగ్గేవరకూ అలాగే ఉంటుంది. పాపం జ్వరంవచ్చిన తరవాత ఎంతచిక్కిపోయారు! ఇంట్లో ఊరగాయలూ అవీ పథ్యానికి పనికివచ్చేవి ఉన్నాయి. అభ్యంతరం లేకపోతే పంపిస్తాను, నోటికికాస్త హితవుగా ఉంటాయేమో"

"బాబుకల్లాంటి అభ్యంతరాలులేవు, మీ అన్నయ్య పిలవకపోబట్టికాని మీ యింట్లో భోంచెయ్యడానికి కూడా వెనకతియ్యరన్నమాట"

"అన్నయ్యకీ ఈ చాదస్తంలేదు కాని అమ్మమాటకి ఎదురుచెప్పలేడు. అమ్మ బొత్తిగా పూర్వకాలపు మనిషి."

"ఇల్లా అనుకుంటూ వాళ్లు దొడ్డివేపుకి వెళ్లిపోయారు. మర్నాడు మధ్యాహ్నం కూడా ఒకసారివచ్చి తాను పంపిన ఊరగాయలు నాకెల్లారుచించినదీ ఆదెమ్మను అడిగి తెలుసుకున్నది సత్యవతి.

"అందువల్ల నా ఆజ్ఞ ప్రకారం ఆదెమ్మ తెచ్చిన పునర్వివాహప్రశంస ఆమెకు అంగీకారం కాకపోయినా కోపకారణం కాలేదని నేను గ్రహించాను. కాబట్టి స్వయంగానే ఆమెతో మాట్లాడి చూడాలన్న బుద్ధి నాకు పుట్టడంలో ఆశ్చర్యమేముందీ?

"తక్షణమే ఆదెమ్మనిపిలిచి అందుకు తగిన ఏర్పాటు చేయవలసిందని చెప్పాను. ముఖాముఖిని నాతో సంభాషించడానికి సత్యవతి మొదట సందేహించినప్పటికీ ఆదెమ్మ నొక్కి చెప్పిన మీదట ఎట్టకేలకు ఒప్పుకుంది. మర్నాడు మధ్యాహ్నమే తగిన సమయమని నిశ్చయింపబడింది.

"మర్నాడు ఉదయంనించీ ఆమెతో మాట్లాడ్డానికి తగినట్లుగా భావాలను సరిచేసుకుంటూనే గడిపాను. సరిగా మూడుగంటలకి సత్యవతివచ్చింది. నాయెడల వారికుటుంబము చూపుతూవున్న ఆదరణకి కృతజ్ఞతను నేను తెలియచెయ్యడంతో సంభాషణ ప్రారంభమైనది. అవివాహితకన్నమూ పరపురుషునితో మాట్లాడి ఉండనందున ఆమెయందెంతో జంకును భయమును నాకు కనబడ్డాయి.

"ఆనాడామె సౌందర్యమద్వితీయమై ఉంది. కట్టుకునే నేతవల్ల సాధారణపు చీరలుకూడా వన్నె తెచ్చే తెలివితేటలామెలో నాకు కనబడ్డాయి. అవనతమైయున్న ముఖమునందును, ఆరుణమైయున్న చెక్కిళ్లయందును సిగ్గుదొంతరలు తాండవిస్తున్నాయి. గాంభీర్యపరమైన దూరాన్ని ఆమె నిలుపుతుంది. నేనెంతచెప్పినా ఆమెకూ తోచలేదు. నేనిల్లా ముక్తసరిగా నా అభిప్రాయం తెలియచేశాను.

"అమ్మా! నిష్కల్మషభావంతో అడిగే నాప్రశ్నకి మీరు జవాబు చెప్పాలి. మా రాజమహేంద్రవరంలో బాల వితంతువుల కోసం ప్రత్యేకం ఒకసంస్థ ఉంది. దుఃఖంతో మునిగిపోతూవున్న అమాయిక లఘుబాలికల దురవస్థ చూడలేక ఒక మహాపురుషుడు స్థాపించాడు దాన్ని. స్త్రీలకు పునర్వివాహము చేయవచ్చునని వేదప్రమాణంగా ఆయన రుజువు చేశాడు. కాబట్టి మళ్లీ పెళ్ళిచేసుకున్నందువల్ల పాపంవస్తుందనే భావం మనలో నించిపోవాలి. చదువుకున్నారు గనుక ఆ మహాపురుషుడు రాసిన పుస్తకాలు నా దగ్గర ఉన్నాయి. మీరు చదవవచ్చును.

"నా మాటల నామె మౌనముద్రాంకితయై వింటూ నిలుచుంది. నేను మళ్ళా చెప్పడం సాగించాను. ,రాజమహేంద్రవరంలో ఉన్న సంస్థను గురించి మీకు తెలియచేసి దానివల్ల తగినలాభాన్ని మీరు పొందేటట్లు చూడ్డమే ఆ సంస్థకు మేము చేసే సహాయమై ఉంది. మొగమాటంచేత నాకా అభిప్రాయంలేదు. అని మీరుఅనవచ్చును కాని మీసోదరుడితో ఎల్లానిరభ్యంతరంగా చెబుతారో అలాగే నాతోచెప్పాలి. లోపల ఒకలాగపెట్టుకుని పైకి ఇంకోలాగ చెబితే లాభంలేదు.

"ఆసంస్థవారు వితంతువులకు విద్యాబుద్ధులు చెప్పించి తగిన వరుణ్ణి చూసి వివాహం చేస్తారు. మీ కిష్టమైతే మీ అన్నగారితో

చెప్పి మిమ్మల్ని అక్కడికి పంపించేటట్లు యేర్పాటు చేస్తాను. మిమ్మల్ని చూసి జాలికలిగి యిల్లా చెబుతున్నాను కాని ఇంకొకటి కాదు!

"నాకామె ఏ జవాబూ చెప్పలేదు. నేను చెప్పినదంతా విని మెల్లిగా వెళ్ళిపోయింది. నాదగ్గిర ఉన్న పుస్తకాల నన్నిటినీ ఆమె చదువుకుంది. ఆదెమ్మయందు ఆమెకు మిక్కిలి నమ్మకం కుదిరిపోయింది. తన మనసులోని బాధను ఆమెతో ఎన్నిసార్లో సత్యవతి చెప్పుకునేదట.

"ఆదెమ్మని తరుచుగా మా కుటుంబ వ్యవహారాలను గురించి సత్యవతి అడుగుతూ ఉండేది. స్వామి భక్తియందు ఘర జీవితాన్ని విసిపోని ఆదెమ్మ ఉచితరీతిని జవాబు చెబుతూ ఉండేది. అందులో నా విషయం వచ్చినప్పుడు ఆమె ఎక్కువ శ్రద్ధ వహించి మాటిమాటికీ ప్రశ్నలు వేస్తూ వివరాలను తెలుసుకోడానికి కుతూహలం కనపరిచేదని ఆదెమ్మ తరవాత నాతో చాలా సార్లు చెప్పింది. అందులో విశేష మేదీ ఉన్నట్లు నా కప్పుడు గోచరించలేదు."

* * * * *

"వర్షాకాలపు దినములు. రాత్రి పదిగంటలు దాటింది. ఆ రోజు పూర్వం రెండు రోజుల నించీ ముసురుపట్టి విడవకుండా వర్షం పడుతూంది. ఆనాటి రాత్రి కటికచీకటితో దిమ్మరించి ఎట్లే వర్షం పడుతూంది. పర్వతాల్లో పిడుగులు కొడుతూ నాలుగువేపులా పెట్టేస్తూంది. గోదావరి నిండువరదలతో మాకు సమీపాన్నే ప్రవహిస్తూంది.

"భోజనాలు ముగిసినప్పటి అందరూ నిద్రాగతులైపోయి చాలాసేపయింది. నిద్రాదేవి ప్రజలపైని సర్వాధికారాన్ని చెలాయించడానికి తగిన సమయమది. నేను కూడా ఎనిమిది గంటలకే పడుకున్నాను. ఇప్పటికి కొన్నాళ్ళగానే నాకూ నిద్ర పట్టేసింది. స్వప్న వీథులలో సుఖదుఃఖముల మధ్య నా మనస్సు స్వేచ్ఛావిహారం చేస్తూంది.

"అలాంటప్పుడు నా గదికి వీథవేపున ఉన్న కిటికీతలుపు ఎప్పుడైనాను కొంచెం మెసలవచ్చింది. లోపలిగడియ వెయ్యకపోవడం చే గాలికి తలుపు అల్లాకొట్టుకుంటూంది కాబోలనుకుని బద్ధకం చే మంచంమీదనుండి లేవకుండానే అటువేపు చూశాను.

అప్పుడు నా ఆశ్చర్యమేం జెప్పను! కిటికీ గవాక్షంలోనించి ఒక హస్తము కొద్దిగా లోపలప్రవేశించి ఒక కాగితాల కట్టను లోపల వేసి చటాలున అదృశ్యమైపోయింది. తగ్గించబడి ఉన్న దీపపు కాంతియందు ఆ చెయ్యి ఎవరిదో పోల్చుకోడానికి అవకాశం చాలింది కాదు. ఇదంతా ఒకచిటికెలో జరిగిపోయింది. కొంతసేపటివరకూ అదినిజమో స్వప్నమోకూడా నాకు బోధపడలేదు."

౬

"అయిదు నిముషాలు అల్లాగే ఉండి, దీపం బాగా పెద్దచేసుకుని కిటికీదగ్గిరకెళ్ళి ఆ కాగితాన్ని జాగ్రత్తగా తీసి చూశాను. అదే నా జీవితమునందే అపురూపమగు మార్పును కలిగించడానికి మూలకారణమైన జాబు. అదే దుఃఖనిర్భిన్న హృదయయగు సత్యవతి తన్ను దహించి వేయుచుండిన భయంకర వేదనను ప్రకటిస్తూ ఏడ్చి వ్రాసిన కరుణారసభరితమగు జాబు. ప్రియపుత్రకా! ఆ జాబును క్రిందను ఉదహరిస్తున్నాను.

"సత్యవతి నమస్కారములు: ఆర్యా! మీరు నాయందుచూపిన ఆదరణాభిమానములే నన్నీ జాబును వ్రాయ ప్రోత్సహించాయి. ఇల్లా స్వతంత్రించినందుకు క్షమింతురు గాక!

"నాస్థితిని చూసి జాలిపడి, ఈ దీనురాలిని ఉద్ధరించే అభిప్రాయంతో మీరు చెప్పినమాటలను ఇన్నాళ్ళూ ఆలోచన చేసుకుంటూనే ఉన్నాను. మీరిచ్చిన పుస్తకాలు నామనసులోని సందేహాలను పోగొట్టేశాయి. నాలో ఆశాజ్యోతిని వెలిగించి చివరికి నేనొక నిశ్చయానికి రావడానికి అవన్నీకూడా సహాయపడ్డాయని చెప్పక తప్పదు.

"నా భర్తపోయి పది సంవత్సరాలకి పైగా అయింది. నేను సరిగా రెండుమూడు నెలలైనా కాపురం చేశానో లేదో నాకే జ్ఞాపకం లేదు. తరవాత రెండుమూడు సంవత్సరాలదాకా భగవంతుడు నాకింతే రాశాడు కాబోలని ఏడుస్తూ ఊరుకున్నాను.

"ఇంతలో తూర్పున విశాఖపట్నం జిల్లాలో మా బంధువుల యింట్లో జరిగిన పెళ్ళికి మేమందరమూ వెళ్ళడం తటస్థించింది. అది పిల్లలకి వైధవ్యం సంభవిస్తే పునర్వివాహం చేసే ఆచారం ఆ వేపున మా బంధువుల్లో నేటికీ ఉంది. అల్లాగ మళ్ళీ వివాహం చేసుకుని భర్తలతో సౌఖ్యకరమైన సంసారం చేస్తూ ఉన్న నా యీడు పిల్లల నెందరనో ఆ పెళ్ళిలో చూశాను.

"అది మొదలు నుండీ నా బాధకి! విధవల వైధవ్యం భగవంతుని సృష్టి కాదని నాకప్పుడే తెలిసింది. నేను కూడా అల్లా పెళ్ళి తిరిగి చేసుకుంటే వాళ్ళలాగే సుఖపడి ఉండగలను గదా అనుకుంటూ ఒంటి జీవనాన్ని గడపలేక ఎన్నాళ్ళు ఏకాంతంలో ఏడ్చానో దైవానికి తెలుసును.

"ఈ వేపున ప్రజలలో ఈ ఆచారం లేదని నే నెరుగుదును. ఈ దేశానికి వచ్చినందువల్ల మావాళ్ళు కూడా ఉన్న ఆచారాలను వదిలిపెట్టినారు లేం బాలికలను బాధించడం ఏమంత మంచిపని చెప్పండి? తూర్పున ఉన్న మావాళ్ళకంటె ఎక్కువ నాగరికుల మనిపించుకుందామని కాబోలు ఇక్కడికొచ్చిన తర్వాత మావాళ్ళు అనాదిసిద్ధంగా వస్తూ ఉన్న పూర్వాచారాలు మానుకుని లేనిపోని కొత్తమార్గాలు తొక్కుతున్నారు.

"స్త్రీపునర్వివాహాలను, రజస్వలా వివాహాలను మా పూర్వులు చాలాకాలం వాడుకలో పెట్టి, వడపోసి మా సంఘానికి మంచివని నిర్ణయించారు. ఇప్పుడు మావాళ్ళు వాటిని విడిచిపెట్టడ మెంత బుద్ధితక్కువో చూడండి! ఏ బాధలనుండి అగ్రవర్ణాలవారు

తప్పించుకోడానికి ప్రయత్నిస్తున్నారో, వాటినే మేము ఆహ్వానించి తెచ్చి నెత్తిమీద పెట్టుకుంటున్నామన్న మాట.

"కాని ఇదంతా ఆలోచించే వారెవరు ? నా గతి ఇంతే' అనుకుని ఏడుస్తూ పడుకునేదాన్ని.

"కాలక్రమాన్ని అదుఃఖమే నాకు అలవాటై పోవడంచేత మొండితనం వహించుకుని జీవిస్తున్నాను. గదిలో మంచంమీద పడుకుని గాఢాంధకారంతో నాదుఃఖం వెళ్ళబోసుకుంటూ ఏడవని రాత్రి లేనేలేదు. నా భర్త పోయిన తరవాత పదిరోజులుపాటు ఏడిచి ఊరుకున్న మావాళ్ళకి నేను రోజూ ఏడుస్తున్నట్లు ఏం తెలుస్తుంది?

"మీ దయాపూరితహృదయాన్ని తెలుసుకున్న తరవాత నాకు మళ్ళీ ధైర్యము కలిగింది. మొరడు బారిపోయిన భావాలన్నీ మళ్ళీ చిగురించడం ప్రారంభించాయి. మీరు చెప్పినదంతా నేను సావధానంగా ఆలోచించాను. ఇప్పుడు నేను మళ్ళీ వివాహం చేసుకోడానికి బహుశా మా అన్నయ్య ఒప్పుకుంటాడు. మా అమ్మ మాత్రం ఇష్టపడదు. నేను పెండ్లి చేసుకుంటే నాకూ మా అమ్మకీ మరి సంబంధం ఉండదు. అవిడ బహుపట్టుదల మనిషి.

"మావాళ్ళనందరిని పూర్తిగా వదిలిపెట్టి పోడానికి నాకు ధైర్యం చాలదు. అందుచేత నేను రాజమహేంద్రవరంలో ఉన్న సంఘమువారిని అనుసరించజాలను. కాని నాహృదయాన్ని మీ ముందర విప్పి చెప్పేస్తాను.

"మిమ్మల్ని చూసినప్పటి నించీ నామనసులోని దిగులుపోయి ఆశాజ్యోతికనబడిందో, అట్టి మీసేవ చేసుకుంటూ నాజీవితాన్ని గడపడమే నాతుది నిశ్చయం. ఇందుకు మీరు అంగీకరిస్తే ధన్యురాలనే. మావాళ్ళకి దూరమై పోనక్కరలేకుండా, వాళ్ళు నన్ను పరిత్యజించినప్పటికీ నేను వాళ్ళని చూస్తూనైనా ఇక్కడ ఉండవచ్చును.

"మీకు రెండవ వివాహపుచింత లేదని ఆరెమ్మ నాకు చెప్పింది. అయినా నన్ను బాధిస్తూ ఉన్న ఒంటరి తనాన్ని సహించలేక ఇల్లా ప్రార్థించినందుకు క్షమించగలరనే నమ్ముతున్నాను. మీరంగీకరించని పక్షంలో ఇంక నాగతి ఇంతేఅనుకుని శీఘ్రమరణానికి ఎదురుచూస్తూ గడిపేస్తాను. అట్టివిషయంలో ఇతరత్రా వివాహం చేసుకోవాలెనని నన్ను మీరు మరిబలవంతపెట్టకుందురుగాక అని ప్రార్థిస్తున్నాను. అలాంటప్పుడు నేనీ లేఖను మీకురాయనట్లే భావించి దీనిని నశింపుచేయవలెనని నా వేడికోలు.

ఇట్లు,
సత్యవతి."

"ప్రియకుమారా! తలవనితలంపుగా, అకస్మికంగావచ్చిన ఈ జాబు నన్ను కలవరపెట్టిందని వేరేరాయవలెనా? అసలు మళ్లీ పెళ్లిచేసుకునే ఆలోచనే నాలో అంతవరకూ లేదు. అందులోనూ సత్యవతివిషయమై నాకట్టి అభిప్రాయమేలేదు. అందుచేత నామనస్సు ఈ నూతనక్లిష్ట సమస్యను ఎదురుకోవలసి వచ్చింది.

"నేనిష్ట పడకపోతే మరణమే శరణ్యమని సత్యవతి రాసింది. ఆ వాక్యం తలుచుకున్నప్పుడల్లా ఆమె మనోహరవదనము పసివాళ్లు వాడిపోయి దీనదృష్టులతో నావంక చూస్తున్నట్లుగా నామనోవీధిని పొడకట్టేది. ముందువెనక లాలోచించుకోలేక ఆరాత్రి అల్లా నేను వేగిపోయాను.

"స్వభావంచేత మెత్తనవాడ నవడం చేతనైతేనేమి, ఏకాకాన్ని కల్మషానికి తావులేని సత్యవతిమృదుల హృదయానికి కష్టంకలిగించలేకనైతేనేమి చివరికి నేనామె ప్రార్థనలకి ఒప్పుకోవలసి వచ్చింది. వివాహానికి కావలసిన ఆడావిడి ఏమంత లేకపోయినా మేము దంపతులమైనందుకు సర్వేశ్వరుడే సాక్షి.

"ఈ మా సంయోగమనను అప్పలస్వామియొక్క హృదయపూర్వకమగు అంగీకారం ఉంది. తల్లి ఒడ్డియును, సంఘభయమును అతనికి ఎక్కువే అయినా, చెల్లెలిపైగల అనురాగమే తుదకు జయించేసింది. నాకు సత్యవతి రాసిన జాబును అతనికి నేను చూపించాను. ఆ ఉత్తరం చదివేటప్పుడతనికండ్ల వెంబడి నీళ్ళు అవిరళంగా ప్రవహించాయి. చెల్లెలి సౌఖ్యానికి అభ్యంతరం చెప్పడానికతడిష్టపడలేదు.

"వారి తల్లి మనస్తత్వమెలాంటిదో కాని తరవాత మరి కుమార్తె ముఖం చూడ్డానికామె ఒప్పుకోలేదు.

"సత్యవతి మాయింటికివచ్చిన ముహూర్తంనించీ ఇల్లంతా ఒక్కసారిగా లక్ష్మీకళలతో తొణుకలాడిపోయింది. శూన్యమైపోయిన నాహృదయంలో కూడా ఎక్కడలేని ఉత్సాహమూ, ప్రేమా వెల్లివిరిసిపోయాయి. మనస్ఫూర్తిగా నేను సంస్కరణవాదినే అయినా, సంఘభయమూ నలుగురిలోనూ రచ్చబడిపోవడమూ యిష్టంలేక సత్యవతి కోరికపైని నేను కూడా ఈ వివాహాన్ని రహస్యంగానే ఉంచక తప్పిందికాదు."

౪

"అయిదారు నెలలవరకూ దినములు బహుసౌఖ్యంగా గడిచిపోయాయి. మొరడు బారిపోయిన జీవాలు రెండూ చిగురించి నవ్యశోభతో ప్రకాశించాయి. సత్యవతియందు గర్భధారణ చిహ్నాలు కనిపించాయి. స్త్రీ సహజమగు మాతృత్వవాంఛ సఫలమగునని తెలిసినతోడనే ఆమె ఆనందమేమని వర్ణింతును!

"కాని ఈ సంతోష మెక్కువకాలం నిలవలేదు. తన స్థితిని తెలియచేస్తూ ఒక్కసారి రమ్మని సత్యవతి తల్లికి కబురుపంపింది. కాని ఆమూర్ఖురాలు రావడానికి సమ్మతించలేదు. సత్యవతి చావుకి అదిడే మూలకారణమని నేటికి నేను భగవంతుని సాక్షిగా నమ్ముతున్నాను.

"తల్లిచూపిన నిరాదరణ భావమామెకి భరించరానిదెబ్బ అయిపోయింది. అదిమొదలుకుని ఆమెసంతోషం మాయమైపోయిందనే చెప్పవచ్చును. ఆ[illegible]ఆనందం సమకూర్చడానికి నేను చేస్సి

ప్రయత్నాలన్నీ వృథాఅయిపోయాయి. ఎల్లాగైనా నన్ను చెప్పి తల్లిని ఒక్కసారి చూపించమనే ఆమె నన్ను బతిమాలేది. అది నాకు సాధ్యంకాలేదు. అప్పలస్వామికూడా తల్లితో చాలాదూరం చెప్పాడు కాని నిష్ఫలమైపోయింది.

“క్రమక్రమంగా నెల లతిక్రమించి ప్రసవసమయము సమీపించింది. సత్యవతి హృదయంలోని దిగులు దినదినాభివృద్ధి అయిపోతూంది. నేనూ, అన్నగారూ చెప్పిన ధైర్యం పనికిరాలేదు.

“నిండుమాసాలుగా ఉన్నవాళ్ళలో ఇట్టి మనోవ్యధ ఆమెకు హానికరమని మాకు తెలుసును. కాని చేసేది లేక ఎంతో భయంతోనూ, ఆతురతతోనూ రోజుకి రోజూ కృశించిపోతూ ఉన్న ఆదివ్యసుందర విగ్రహం వంక చూస్తూ కూచునేవాళ్ళము నేనూ, అప్పలస్వామీని. ఆఖరుకి మేమనుకున్నట్లుగానే ఆమె మంచం పట్టిపోయింది.

“ఇంక నామాట చెప్పడమెందుకు? అన్నిపనులూ కట్టిపెట్టుకుని విడువకుండా ఆమె మంచంపక్కనే కుర్చీలో కూచునేవాణ్ని. పాలిపోతూన్న ఆ చెక్కిలవంక చూసేసరికి నాపేగులు తిరిగిపోయేది. లేని సంతోషం తెచ్చుకుని నామనస్సు ప్రశాంతంచడానికామె ప్రయత్నించేది. నిస్తేజములైన నేత్రములును, హృదయపూర్వకము గాని నవ్వును ఆమె హీనస్థితిని చెప్పకనే చెబుతూ ఉండేవి. ఈ ప్రయత్నాలవల్ల ఆమె మరింత అలసిపోవడంతప్ప వేరేలాభం లేకపోయేది.

“వ్యాకులమై, మ్లానమై, మధురమైన ఆమె మనోహర వదనము శుష్కించిపోవడం చూసినప్పుడు నాదుఃఖం వర్ణనాతీతమై పోయేది. “ఇప్పుడే ఇంత నీరసించిపోయిన ఈమె ప్రసవవేదనలనెల్లా సహిస్తుంది? ఈ పవిత్ర పుష్పం యిల్లా రాలిపోడానికే కాబోలు అదృష్టహీనుడైన నాతో సంబంధం కల్పించుకుంది! ఇంక నాజీవితానికి సౌఖ్యమెల్లాగ” అనుకుంటూ కన్నీళ్లు రాల్చేవాణ్ని.

* * * * *

“కుమారా! ఇంక ఈ విషాదగాథలోని ఆఖరుదశకు వస్తున్నాను.

“ప్రసవవేదన లారంభమైనాయి. అందుకు తగిన వైద్యసహాయాన్ని సిద్ధం చేసుకుని మేము అంతకుముందు నించీ జాగ్రతగానే ఉన్నాం. ఒక పగలూ ఒక రాత్రీకూడా ఆసుకుమారమూర్తి తీవ్రవేదనను అనుభవించింది. ఆవేదన కామె నలిగిపోయింది.

“తనకు కలిగిన మగశిశువును చూసుకున్న సంతోషమెంతోసేపు అనుభవించకముందే ఆమె మూర్ఛాగతురాలై పోయిందని ఆదెమ్మ ఆత్యాత్రముతో మాకు చెప్పింది.

“అప్పుడు మేముపడిన ఖంగారింతంతకాదు. ఈ బాబు రాస్తున్నప్పుడు కూడా నాటి విషయాలు జ్ఞాపకానికొచ్చి అశ్రువులు కళ్లలోనిలిచి దృష్ట్యవరోధాన్ని కలిగిస్తున్నాయి. ఈవిషాద వృత్తాంతాన్ని రాయడానికి ఇల్లా బతికించడంకంటె భగవంతుడు నన్ను కూడా తీసుకుపోతే ఎంత బాగుండేది!

“మరి నాలుగు గంటలకి సత్యవతికి మెలుకువ వచ్చింది. కాని తీవ్ర జ్వరమొకటి ఆమెను పట్టుకుంది. ఆజ్వరంనుండి ఆమె మరి తేరుకోలేదు—వైద్యుడు బహుశ్రద్ధగా చికిత్స చేసినప్పటికీ లాభించలేదు. పదిరోజులా స్థితిలో ఆమె ప్రాణం కొట్టుకుంది. పదోనాడు ఇంక కొన్ని గంటలకంటే ఎక్కువకాలం జీవించదని చెప్పి నిరాశచేసుకుని వైద్యుడు వెళ్లిపోయాడు.

“అబ్బాయీ! అప్పటి నాస్థితిని రాయడానికి నాకు శక్తిచాలదు. అందరమూ ఆమె మంచంచుట్టూ నిలబడి అతిశీఘ్రంగా క్రుంగిపోతూఉన్న ఆమెవేపు చూస్తున్నాం. అప్పుడామె సత్యవతి నావేపు బరపిన దీనాతి దీనములగు దృష్టులు నాజన్మమధ్యంలో మరవలేను.

“అందరినీ వెళ్లిపొమ్మని ఆమె సంజ్ఞచేసింది. ఉబుకున్నట్లై పోతూఉన్న దుఃఖంతోనే నామె ప్రక్కనే కూచున్నాను. నాకుడి చేతిని తన రెండుచేతులమధ్యా పట్టుకుని బహుకష్టంతో ఇల్లా చెప్పడం మొదలుపెట్టింది.

“నేనీలోకంలో ఇంక కొన్నిగంటలు మాత్రమే ఉంటానని మీకు తెలుసును కదా. వివాహపు కలలే మానుకుని ఉన్న మీరు నాయందలి ప్రేమచేత నా ప్రార్థనను అంగీకరించినందుకు కృతజ్ఞురాలను. ఈ వేపున ఉండడంచేత మాఅమ్మకీ వాళ్లకీ దూరమైపోను కదా అని ఆశపడ్డాను. కాని ఇక్కడ ఉండడమే ఈ కష్టస్థితికి కారణమై పోతుందని ఎన్నడూ అనుకోలేదు”

“సత్యవతి నేత్రాల్లో నీళ్లునిలిచాయి. భావోద్రేకంవల్లను, నీరసంవల్లను ఆమె కొంతసేపు మాట్లాడలేక పోయింది. కొంచెం సేదదేరి మళ్లీ చెప్పింది.

“ఎందుచేతనో గాని నేను మొదటిసారి కబురంపినప్పుడు మాఅమ్మ రాకపోవడంతోటే నాగుండెల్లో ఒకవిధమైన బెంగ పట్టుకుంది. ఆవిడ రాకపోవడంవల్ల నాకేలోటూ లేదుకాని నన్నా బెంగమాత్రం వదిలిందికాదు. మీస్నేహ సౌఖ్యంలో ఆవిచారాన్ని మరిచిపోదామని ప్రయత్నించాను. కాని గర్భవతినైన సంగతివిన్న తరవాత కూడా మాఅమ్మ రావడానికి నిరాకరించడంవల్ల పూర్వపు విచారం మళ్లీ ద్విగుణీకృతంగా తలయెత్తి రోజుకి రోజూ నాహృదయాన్ని తినేసింది. రాత్రీ పగలూ నాకదే ఆలోచన.

“ఇంత సమీపంలో ఉండి కూడా మాఅమ్మ నన్ను చూడకపోడానికి నేను చేసిన అపరాధ మేమిటో తెలియదు. మాఅమ్మ ఇంత నిర్దయురాలై పోతుందని అనుకోలేదు. సరే పోనివ్వండి.”

సత్యవతికి దుఃఖం పొంగి పోయింది. అవిరళంగా అశ్రువులు ప్రవహించాయి. ఆవిచారం చూడలేక నేను ముఖం చాటు చేసుకో వలసి వలసి వచ్చింది. కొంచెం సేపు ఆయాసం తీర్చుకుని ఆమె మళ్లా చెప్పింది.

“నేను వచ్చానన్న మాటేకాని మిమ్మల్ని కొంతకాలమైనా సుఖపెట్టలేక పోయాను. నా మూలాన్ని మీకు దుఃఖం తప్ప ఆనందం కలగలేదు.

"అయినా మీరు నావిషయంలో ప్రదర్శించిన ఓరిమి నిరుపమానమైనదని చెప్పక తప్పదు. మీ ప్రేమ అగాధమని నేను ఒప్పుకుంటున్నాను. విశాలహృదయులైన మీ స్నేహభాగ్యం చిరకాలం అనుభవించడానికి నేను నోచుకోలేదు కదా అనే నా విచారము.

"ఇంక నా ఆఖరు ప్రార్థన ఒకటి ఉంది. నా గురించిన విచారం చేత మీ శరీరారోగ్యానికి భంగం కలిగించుకుంటారేమో నని నా భయము. మరి ఇద్దరమూ కూడా లేకపోతే ఉదయకుమారు యొక్క అభివృద్ధిని చూసే దిక్కెవరు? కాబట్టి మీరు నన్ను సాధ్యమైనంత వరకూ మరిచిపోయి ఆ బిడ్డని బాగు చేయాలి. సరియైన బాధ్యత గలవారు లేకపోతే ఆ చిన్నబిడ్డ నాశనమై పోవడం నిశ్చయం. మిమ్ములిని వదిలిపెట్ట లేకుండా ఉన్నాను. క్షమించండి. అమ్మా—!"

"అంటూ ప్రక్కనున్న కుమారుని వేపు చూసి ఆమె చాలా సేపు దుఃఖించింది. నా తల గిర్రున తిరిగి పోయింది. ప్రపంచమంతా అంధకారమయమై పోయింది. కూర్చున్న పాటునే స్పృహ తప్పి నేలపై పడిపోయాను.

"నాకు స్పృహ వచ్చేటప్పటికి ఇంటిలోవారంతా నా చుట్టూ నిలబడి ఉన్నారు. ఇంకొక అరగంటకి సత్యవతి ప్రాణం పోతుందన్నప్పుడుగాని ఆమె దగ్గిరికి రావడం కలగలేదు. నిస్తేజమై పోతూ ఉన్న నేత్రాలతో సత్యవతి మరణానికి కారకురాలైన తల్లి వేపు చూసింది.

"ఎంత కఠినురాలైనా తల్లిప్రాణం గనక అవ్వగారి హృదయవ్యధను ఏమాత్రం ఆపుకోలేకపోయింది. కన్నీటితో కుమార్తె ముఖాన్ని ముంచేసిందామె. ఏం లాభం? సూర్యభగవానుడు పైకి చేరుకుంటూ ఉన్న సమయంలో సత్యవతి జీవన విహంగములు సుఖపూరితమగు ఇహలోకాన్ని వీడి శాశ్వతసౌఖ్యధామమగు స్వర్గము వంకకి ఎగిరిపోయాయి."

౮

"కుమారా! ఇంక తోటివాళ్ల గొడవలన్నీ ఎందుకూ రాయడం! నాకు మతిపోయిందని అందరూ అనుకునేవారు. అమాయకురాలగు ఒక సుందరీమణి ప్రాణం కుంగిపోతూ ఉంటే మొదటినించీ చూస్తూన్నప్పుడు మతిపోవడంలో గొప్ప యేముంది? ప్రపంచమే కారుచీకట్లతో నిండిపోయినప్పుడు నాకు మతిపోక ఏమవుతుంది?

"ఇంక పిల్లవాణ్ణి చూస్తే నాగుండెలు అసలే ఆగిపోయేవి. అంతా తల్లిపోలికే. నవ్వేటప్పుడు బుగ్గలమీద గోతులూ, ఆ పెదవుల సౌందర్యమూ, అంతా తల్లి మాదిరిమూర్తులూను. వాణ్ణి చూసినప్పుడల్లా తల్లిని చూసినట్టే ఉండి మరింత బాధా కలిగేది. ఊరటా కలిగేది.

"వాణ్ణి పెంచడం బాధ్యత చిన్నయ్యమీదా ఆదెమ్మమీదా పడిపోయింది. సంతానహీనులైన అవ్వగారిద్దరూ బంగారపు పర్వతం దొరికినట్లు పొంగిపోయి పిల్లాణ్ణి రెప్పల్లో పెట్టి పెంచారు. ఈ విషయంలో వాళ్ల ఋణం ఎన్నటికీ తీర్చుకోలేను. సంఘభయం చేత ఆ పిల్లవాణ్ని చిన్నయ్య కుమారుడని అనవలసివచ్చింది. అల్లా అనకపోతే మనసంఘంలో వాడికి ఏమూలనైనా సముచితస్థానము లేకుండాపోతుంది. అందరూ వాణ్ణి హీనంగా చూస్తారు.

"సంఘం శిక్షిస్తుందన్న భయంచేతనే కుమార్తె చూడ్డానికైనా అవ్వగారు నిరాకరించింది. తల్లీ, బంధువులూ దూరమైపోయారన్న బెంగచేతనే సత్యవతి చచ్చిపోయింది. ప్రజాభిప్రాయము సంస్కారం వేపుకి సుముఖంగా ఉన్నట్లయితే ఇలాంటి దుర్మరణాలు ఎన్నో తప్పిపోయి ఉండును.

"నాయనా! చంద్రయ్య నీకు సోదరుడే అని యిప్పుడు నీకు తెలిసిపోయిందికదా! అందుకే నా స్వంతఆస్తిలో సగం భాగం ఆ అబ్బాయికివ్వడంలో గల అంతర్యం నీకిప్పుడు బోధపడిందనుకుంటాను. నేను చనిపోయినప్పటికీ చంద్రయ్య కేలోటూ రాకుండా చూసే భారం నీది. నీ సత్ప్రవృత్తియందు నాకు సంపూర్ణమైన నమ్మకము ఉంది. గనుక ఈ విషయంలో నాకే విచారమూ లేదు.

"అయితే ఒకనౌకరు కొడుక్కి ఇవ్వతగ్గదేనా ఆ ఆస్తి అనే ప్రశ్న బయలుదేరవచ్చును. దీనికి తగిన సమాధానం ఉంది. చిన్నయ్య పేదవాడన్నమాట. కాని సుకులంవాడు. దూరపుబంధువుడు కూడాను. వాడి స్వామిభక్తికి ఎంతిచ్చినా అధికం గాదని వాణ్ణి ఎరిగిన వాళ్ళందరికీ తెలుసును. అందుచేతనే నా విల్లులో అల్లా ఏర్పాటుచేశాను. ఇందువల్ల చంద్రయ్యయందు ప్రాణాలన్నీ పెట్టుకుని చనిపోయిన చిన్నయ్య ఆత్మకికూడా సంతోషం కలుగుతుంది.

"ఇంక నా విచారాన్ని గురించి నీవు అధికం రాయనక్కరలేదు. ఈ విచారం ఇంక నన్ను వదలదు. నేను వదలలేను కూడాను. అదే నాకు జీవనాధారమై ఉంది.

"సత్యవతిని గురించి చెప్పదలుచుకుంటే భారతమంత గ్రంథమవుతుంది. ఈ నిర్భాగ్యుడామెతోడి సౌఖ్యానికి నోచుకోలేదు. నా దుఃఖం ఎంతకీ ఉపశమించేది కాదు. ఇంక నన్నిలా వదిలిపెట్టెయ్యండి. చంద్రయ్యని నీ జాగ్రత్తకి అప్పజెప్పి నిర్విచారంగా ఉండగల ననే ధైర్యం నాకుంది అంతే చాలు."

జాబు పూర్తి అయింది.

# అమ్మనమ్ముకుందాం

వేలూరి శివరామశాస్త్రిగారు

[సముద్రం అనే చీర కట్టుకొని అడవులు అనే నల్లని కుంతలాలు దువ్వుకొని సూర్యచంద్రులు అనే కన్నులతో చూస్తూ దిక్కులు అనే బాహువులు చాఁచి ఉగాది పండుగునాఁడు దీవిస్తూ ఉన్న భూదేవిముందు, చినుఁగు పాతలు తలకు చుట్టుకొని ఉతుకుతున్న మడతలు తాల్చి పిపమువ్వలతో అల్లిన బుట్టలలో తవిఁదలూ అలచందలూ సజ్జలూ అరిగెలూ జొన్నలూ నెవ్వరులూ, దోసలూ, కొతిమిరా వేపపువ్వూ కరివేపాకూ ఎత్తుకొని కర్షకజాతి ప్రవేశిస్తుంది. ఇల్లా ప్రవేశించి బుట్టలు దించి పాగలు తీసి మోఁకరించి] కర్షకజాతి—మాయమ్మకు దణ్ణాలు. మాతల్లికి దండాలు. భూదేవికి దండాలు. [అని లేచి తాము తెచ్చిన ధాన్యములు కానుక లిచ్చి నిలువఁబడును.]

భూదేవి—కలకాలి కలకాలి! నాకున్నారా! వచ్చికి పండా దైంద మిమ్మల్ని చూసి. మీరందఱూ ఆరోగ్యంగానూ, బలిష్ఠంగానూ ఉన్నారా? నాకు చెల్లెలున్నూ మాకు పినతల్లిన్నీ అయిన గోదేవియొక్క సంతానం బాగా వృద్ధిగా వుందా? మీ ఆలుబిడ్డ లందఱూ వాటితో ఆడుకుంటూ పాడుకుంటూ మీకు చేదోడుగా వున్నారా?

కర్షకజాతి—కనఁబడుతూనే ఉన్నాంగా మాతల్లీ! మీదయవల్ల మాపిన్నమ్మబిడ్డలూ మేమూ బాగున్నాము. మా ఆలుబిడ్డలు మాకు సాయం చేస్తున్నారు. మాకు సాయ మేమిటి? వాళ్లపనులు వాళ్ళు చేసుకుపోతున్నారు. ఇదంతా మీదీవన మహాత్మ్యం.

భూదేవి—నాయనా! మీవాలకం కనఁబడుతూనే ఉంది. వంటచెరుకువంటి మీశరీరాలూ, శతచ్ఛిద్రాలుగల మీపాగలూ, వీపులకు అంటుకుపోయిన పొట్టలూ ఇవన్నీ చూస్తూనే వున్నాను. ఇదంతా మీలే. మీరు బతకడంకోసం తింటున్నారుగాని తింటంకోసం బతకడం లేదు. మీరు అప్రయత్నంగా ద్వంద్వాలు జయించారు. మీరు నాపెద్దబిడ్డలు. మిమ్ములను ఎల్లా బతికిస్తానా అనే నాప్రాణం ఎప్పుడూ తపతపా కొట్టుకుంటూ ఉంటుంది. మీ కేం కావాలో కోరుకోండి.

కర్షకజాతి—అమ్మా! నీసారం అంతా మాకిస్తూనే వున్నావు. మేమూ నిన్ను పీల్చి పిప్పి చేస్తూనే వున్నాము. అడగందే అమ్మయినా పెట్టదంటారు కాని నీవే కోరుకోమన్నావు. అమ్మా! మాకు తృప్తినిన్నీ ఇంత హరినామమునున్నూ ఇయ్యి!

భూదేవి—మీరు నాజ్యేష్ఠపుత్రులు కాఁబట్టి జన్మతరించే కోరికలు రెండూ కోరారు. ఈ రెంటినీ మీకు మఱి యిన్నాళ్లా పూరిస్తూ వుంటాను.

కర్షకజాతి—అమ్మా! ధన్యులమైనాం ధన్యులమైనాం. [అని మోఁకరించి లేస్తూ ఉండఁగా డప్పులు వినఁబడును] అమ్మా పెద్ద ఆసాములు వస్తున్నారు. ఒక్క వాళ్లం నలిఁగిపోతాం, సెలవు.

భూదేవి—సమస్త సన్మంగళాని భవంతు.

[కర్షకులు నిష్క్రమిస్తారు. స్థూలకాయులు విశృతాకారులున్నూ అయిన పెద్దఆసాములు పొగాకూ సల్లమందూ సారా, దుస్సులూ గొర్రెలూ మొదలైన వానిని తెచ్చి కానుక లిచ్చి వంకరదణ్ణాలు పెట్టి నిలుచుంటారు.]

భూదేవి—మీ కారోగ్యం కలగాలి.

పెద్దలు—ఇదేం దీవన? మాకు ఆరోగ్యం లేకపోతేగా? మాబంగారుతల్లి ఏదో ఒకటి కటాక్షిస్తుందని విలువగల కానుకలుకూడా తెచ్చి ముందర పెడితే బూరుగుచెట్టయిపోయిందేం? మేమేం బీదరైతులము మల్లే దమ్మిడీ చెయ్యని కొత్తిమిరా దోసకాయలూ తైదలూ అరిగెలూ,—నవ్వొస్తూంది—అహాహాహా— కరేపాకూ వేపపువ్వూ కానుకలు తెచ్చామా?

కొందఱు—ఒరే ఈ సారా ఉందే దీనిమక్క రూపాయ.

ఇంకొందఱు—ఈపొగాకు తాడు మూఁడురూపాయలు.

మఱికొందఱు—ఈగంజాయిపత్రి వీసె పదిహేను.

ఈపోతు నంద. గొర్రె రెండు పుంజీలు !

అందఱు—ఇదేం దీవనమ్మా! మా కారోగ్యం కలగాలి!

భూదేవి—ఎంత తెలియనివాళ్ళర్రా నాయనా! నన్ను కూడా ఇంత మాంసం తిని ఇంతకల్లు తాగి చుట్ట కాలుస్తూ కూచోమన్నారా నాతండ్రుల్లారా! మా కోడళ్ళు చాలామంది నేర్చుకున్నారుగాని—

పెద్దలు—ఇహ కోడంట్రికం ఒకటి తక్కువ.

భూదేవి—నాయనా కోడళ్లే కాదు కూతుళ్ళు కూడా. కోడంట్రికమే కాదు కూతుంట్రికం కూడా.

పెద్దలు—సరే ఇహ చెప్పు.

భూదేవి—నేర్చుకుపోయారుగాని ఇహ నేనే మిగిలి పోయానని ఊరుకుంటున్నారు. ఇటువంటి విషయా లలో మాకు పంక్తిభేదం లేదు. కాని అలవాటయి పోయింది రువాళ అమ్మకయినా ఊరికే ఇస్తారు నాకూ చాటుగా ఇంత అలవాటు చేస్తున్నారు. లేకపోతే నా కడుపున ఈపొగాకూ ఈకల్లూ ఈగంజాయీ ఈనల్ల మందూ ఎల్లా ఫలిస్తవి? ఈకాలుదినుసు లన్నీ నా కలవాటయిన చోటుల నల్లా పాడ పుట్టి తిరగమాతిపో తున్నాను. ఆరోగ్యమూ ఆయుర్దాయమూ తగ్గుతున్నా ప్రాచీనకాలందాన్ని కాబట్టి కొంచెం కొంచెం సలవ రించుకుంటున్నాను. మీ కసలే ఆయుర్దాయం తక్కువా; ఆశ ఎక్కువా. అందులో ప్రాణం బలి కోరే వాటిని వాడుకోడం ఇంకొకళ్ళచేత వాడించడం వాటిని సాగు చెయ్యడం! అందుకని ఆ ఆపత్తు పోవాలని మీకు ఆరోగ్యం కలగాలని శ్రీరామరక్ష పెట్టానమ్మా!

పెద్దలు—మాకు వైద్యులున్నారు! మందు లున్నవి. ఆశీర్వచనాలకు బిడ్డలు పుటతారా?

భూదేవి—పిట్లతాలూకు మత్తూ కసటూ పోగొట్టే మందొకటి ఉందంటే అది దీనికంటె విషం నాయనా! ముల్లు తీసి కొఱ్ఱుడచుకుంటారా? మనుష్యప్రకృతికి పుష్టి కలిగించే దినుసు పండించండి తినండి నాకింత పెట్టండి ఆరోగ్యం పొందండి.

పెద్దలు—బక్కరైతు లందఱూ ఆ ఆరోగ్యాన్ని బాముకోనీ! మాకు కామం కావాలి; నిషా కావాలి. మాకు గర్చుకన్న కామూటం ఎక్కువ. సన్నపంచెలు కావాలి. జలతారు పాగాలు కావాలి. గింజలు పండిస్తే గొట్టోకి రావు. మా కింకా డబ్బొచ్చే నిషాదినుసు లేమైనా పండు!

భూదేవి—పద్దంటే ఎవడూ వినడు. వేదాలు 'పద్దు వద్దు' అని శాసనం చేస్తే ఎవడు విన్నాడు? సరే మీకే తెలుస్తుంది లెండి. తెలిసివచ్చినప్పుడే దిద్దుకుంటారు.

పెద్దలు—ఆఁ. అల్లా గావాలి ధోరణి.

భూదేవి—మీ అభీష్టాలు సిద్ధించాలి.

పెద్దలు—భేష్ భేష్. అడగందే అమ్మయినా పెట్ట దంటారే అది ఇదే.

భూదేవి—సరే పెట్టానుగా ఇంతవిషం. కొడుకులకు విషం పెట్టే మహాతల్లిని నే నొక్కత్తెనే!

అందఱు—అదుగో మళ్లా తప్పటానికి ఎత్తు.

భూదేవి—కాదు నాయనా కాదు. ముమ్మాటికి మీ అభీష్టాలు పొందండి. మీరు తెచ్చిన ఈకానుక లన్నీ మీరే ఉపయోగించుకోండి. ఇవ్వేళ ఉగాదిపండు గ్గాదూ? మీపండుగ నాకూ పండుగే కాని ఒక తేడా వుంది. మీరు పండుగనాడు పొట్ట నింపుకొని మైమఱచే టంత ఉల్లాసంలో ఉంటారు. నేను ఉపాసం ఉండి నాలో నన్ను చూచుకుంటూ ఉంటాను.

కొందఱు—ముసలాళ్లూ ముక్కాళ్లూ అంతే. పండ గంటే వీళ్ళకు ముద్దండగ. పండగ వచ్చిందంటే జప మాలా వీళ్లూ తయారూ.

[పరిమళముతో కూడిన గాలి వస్తుంది. పెద్దవెలుగు కనబడుతుంది. సనాయిపాట వినవస్తుంది. బాష్పరథాల (మోటార్ల)బూరాలు వినవస్తవి. పెద్దామిరా లందఱూ చూస్తారు. చూచి] అమ్మోయ్ అమ్మా! రాజులు వస్తున్నారు. వచ్చేశారు.

కొందఱు—ఒరేయ్ మన్ని నలగదొక్కుతారు. పొగాకూ అవీ తీసుకోండర్రా! లేకపోతే పిల్లు దివాణా ల్లోకి పట్టిస్తారు. పోతుల్నీ గొర్రెల్నీ ముందర తోలండి!

[అందఱూ సెలవైనా పుచ్చుకోకుండా ఎక్కడివా ళ్ళక్కడ అయిపూ ఆనవాలూ లేకుండా వెళ్ళిపోతారు. అంతట ధనికజాతి అనగా పెద్దపెద్ద కోమట్లూ, రాజులూ, మహారాజులూ, మార్వాడీలూ, దళారులూ, నవుకరులూ వస్తారు. వచ్చి నమస్కారం చెయ్యటం అదో లోపం అనుకున్నట్టుగానూ అయినప్పటికీ తప్పనిసరి అయినట్టుగానూ భావిస్తూ ముందరికి వస్తారు.]

రాజులు—స్థిరకు—

నవుకరులు—దణ్ణాలు.

రాజులు—వసుధకు—

నవుకరులు—దణ్ణాలు.

రాజులు—రత్నగర్భకు—

నవుకరులు—దణ్ణాలు.

భూదేవి—మీలో మీకు ఐకమత్యం కలగాలి. మీ కాళ్ళూ చేతులూ అయిన సేద్యగాళ్ళవల్ల మీరున్నూ సేద్యగాళ్ళనో ళ్ళయిన మీవల్ల వాళ్ళున్నూ అన్యోన్యం ఆయురారోగ్యైశ్వర్యాలు కలిగి ఉండాలి.

రాజులు—వాళ్ళకూ మాకూ కవళ్ళూ కడపాలూ ఇదివఱకే బిగిసి ఉన్నవి. వాళ్ళవంటవల్ల మా కడు పేం నిండుతుంది?

భూదేవి—నిజమే. దాదుల పాలవల్ల పెరిగినవాళ్ళకు తల్లిగుణాలెల్లా వస్తవి? అయినా ఎందుకు రావాలి నాయనా నేను మట్టిని.

[రాజులు తమతమ ఒళ్ళు చూచుకుంటారు. నవుకరులు వారి ఒళ్ళు దులుపుతారు.]

భూదేవి—[నవ్వి] దేవతాంశ లెంత మీలో ఉన్నా మీరు మట్టిబిడ్డలే. మట్టికొడుకుల కడుపులు మట్టిలో పుట్టిన గింజలతోనే పెరగాలి. ఆగింజలు పండించేవాళ్ళు మీ అన్నలు. వాళ్ళు దైత్యులూ మీరు ఆదితేయులూ కారు.

రాజులు—అబ్బా! పాతమాటలు చెప్పకు. మాలో మేం చూసుకుంటాం. పండుగగదా అని వచ్చాం. అమ్మా! మాకే, బంగారం కావాలి.

భూదేవి—ఇంకా యెక్కడుంది? కోలారుగను లిచ్చానుగా! ఆగునపాలపోటు ఇంకా నాకు తగులుతూనే ఉంది. మీకు వినబడడం లేదూ? దానివల్లే నాకు పెద్ద కంపం గలిగింది.

మహారాజులు—[తనలో] రత్నపుగనులు ఇదివఱకే ఉజాడు చేశాం. హీరాలు పద్మరాగాలు మరకతాలూ సీమకు వెళ్ళినవి. మావాగాలమీదివి బిళ్ళోరీసామాను. చేతగాక చూసుకోలేక బంగారపుగనులు పడమటివారి చేతులలో పెట్టాం. ఇంకా అడిగితే బాగుండదు. [పైకి] అమ్మా! పోనీ—

భూదేవి—ఇను మింకా ఇచ్చేదా?

రాజులు—ఆ యినపగజ్జెలతల్లి మా కొద్దు. తాతావారికే ఇయ్యి.

భూదేవి—ఏది ఎవరి కిస్తే ఎవరు నిలుపుకున్నారు? వారి కిచ్చిన దంతా సీమకు సలాము చేస్తున్నది. రాగోరుతుందికదా అని రాగి ఇస్తే తెల్లవాళ్ళపరం చేశారు. సినారేకు సీసం ఇత్తడి వెండి వల్ఫ్రమ్ ఇవన్నీ బ్రహ్మదేశంకదా అని బర్మావారి కిస్తే వారు ఇంగ్లాండుపరం చేశారు. మాంగనీజ్ క్రోమూ ఇస్తే దక్కించుకోలేకపోయారు. సరే మీకు అభ్రక మియ్యనా?

రాజులు—పేరు గొప్ప ఊరు దిబ్బ. కాకిబంగారం మా మేము పుచ్చుకునేది?

మార్వాడీలు—(తమలో) ఇదివఱకే ఇంగ్లీషువారి వశం చేశాము. ఇపుడు పుచ్చుకోని ఈకాస్తా వాళ్ళ గంటగట్టి డబ్బు చేసుకుందాం. (పైకి) మీ కొద్దు లెండి. మేం తీసుకుంటాం. అమ్మా! మా కియ్యి!

భూదేవి—తథాస్తు

మార్వాడీలు—సెలవు.

భూదేవి—మంచిది నాయనా మంచిది.

[మారువాడీలు వెళతారు]

[రాజులను చూచి] మీకు కిరసనాలూ కిరసనాల వంటి తైలమూ—

రాజులు—అత్తరనా వన్నీరనా? [ముక్కు మూసికొని] కంపు పాడుకంపు.

భూదేవి—అవన్నీ లోఁగడే విదేశీయుల చేతులలో ఉన్నవిలెండి. పోనీ సున్నమూ సిమెంటూ—

కోమట్లు—మంచి వన్నీ లాఁతివారు లాగేశారు.

భూదేవి—పోనీ చీనామట్టి గిరిమట్టి—

రాజులు—అమ్మా! నీకు కోపం వస్తే వచ్చిందికాని మమ్మల్ని తాపీవాళ్లు కమ్మన్నావా? రాచవాళ్లను కన్న పోలికే నీలో కనఁబడలేదు.

భూదేవి—ఆహాహా నాకేం కోపం? పోనీ నాలో నల్లమసి మాణిక్యాలు ఉన్నవి. తీసుకుపోయినవారు తీసుకపోఁగా ఇంకా మీ కని దాఁచాను. ఆమసి మాణిక్యాలకు నిప్పంటిస్తే నివ్వ లవుతవి. చేతులు మసి అవుతయ్యని అసహ్యించుకోకండి! అదే జగత్తు నంతా నడిపిస్తుంది.

రాజులు—ఛీఛీ బొగ్గులూ బూడిదా—ఇదా మా ఖర్మ! నీ వెక్కడి తల్లివి మే మెక్కడి బిడ్డలం? తల్లికి చిన్నసంతానంమీఁద ప్రేమెక్కువంటారు ఏదీ? ఉన్న దంతా పెద్దవాళ్ళకే పెట్టు!

భూదేవి—లేదు నాయనా నన్ను బద్దలుగా పగలు కొట్టి ఉన్న దంతా తినుకోండి! మీకోసమే నేను బతికున్నాను.

రాజులు—నిజమే. నిన్నడగటమే బుద్ధితక్కువ. నీవు ఉన్న మేలి మంతా గుండెలలో దాఁచుకున్నావు. నీగుండెలు కోసి చూస్తాం.

భూదేవి—ఉంటే బిడ్డలకు లేదనేది తల్లి కాదు. మఱిచారుకాని లోఁగడే నాగుండెలు కోశారు. మీకు ప్రాప్తం లేకపోయిందనే నా విచారంకాని నన్ను కోశారని కాదు.

కొందఱు—[అపవారించి—కొందఱితో] అవునయ్యా అవును మనం ఇహా అమ్మను అమ్మేదాం.

దళారులు—(తమలో) మనం జాగ్రత్తగా ఆలకించాలి.

అందఱు—(ఒకరి మొగ మొకరు చూచుకొని) అమ్మేదాం. అమ్మేదాం.

కొందఱు—ఆపనిమాత్రం ఇదివఱకు జరక్కపోతేగా!

భూదేవి—నాయనా మిగిలిందికూడా అమ్ముకోండి.

అందఱు—అమ్ముకుంటాం, అమ్ముకుంటాం.

దళారులు—[మహారాజులు మొదలగు ధనికజాతితో] ఆవలికి వెళ్లి బేరం ఫైసలా చేసుకుందాం రండి.

అందఱు—ఇక్కడే కానీండి.

దళారులు—(రహస్యంగా) మీఅమ్మ ఎదుట కాదు ఆతల.

అందఱు—కౌన్సిళ్ళలోనా?

దళారులు—రండి రండి.

భూదేవి—సర్వే జనా స్సుఖినో భవన్తు.

[నిష్క్రమణము]

## హిందీవల్ల తెలుక్కి జరుగుతూవున్న అపకారం

“దక్షిణదేశభాషలను చంపేసి, వాటి స్థానే హిందీని ప్రతిష్ఠించడానికే హిందీప్రచారకులు పూనుకుని వుంటే కాంగ్రెస్సు అంగీకరిస్తుందా?” అని కొందరికి సందేహం.

నిజమే. కాంగ్రెస్సు హిందీని వెనకవేసుకువచ్చేటప్పుడు వారికిలా తోచడం ధర్మంగానే వుంది.

కాని హిందీప్రచారకసంస్థలమీద కాంగ్రెస్సు కేమీ పలుకుబడి లేదు. అధికారం లేదు. ఆసంస్థలకూ, కాంగ్రెస్సుకీ ఏమీ సంబంధమే లేదు.

నిజంగా యీ హిందీప్రచారకసంస్థలు కాంగ్రెస్సు చేతికిందే వుంటే అవి యెప్పుడో దిగతీసుకుపోయివుండును. ఏమంటే? తక్షణమే సంపూర్ణస్వరాజ్యం రావాలంటే కోర్టుల బహిష్కారమూ, పాఠశాలల బహిష్కారమూ, శాసనసభలబహిష్కారమూ ప్రధాన ఆమోఘ—అద్వితీయ—అపూర్వసాధనా లని చెప్పింది కాంగ్రెస్సు. కాంగ్రెస్సే వాటిని స్వయంగా—కట్టుదిట్టంగా నడిపింది; కాని ఎలాంటి స్వరాజ్యమూ రాకపోగా ఆ త్రివిధబహిష్కారం కూడా మాయ మయిపోయింది. అంతకంటే బొడ్డున మాణిక్యాలు కట్టుకుని పుట్టలేదీహిందీప్రచారం. హిందీప్రచారకసంస్థలు కాంగ్రెస్సు చేతికిందివే అయితే ఇంత తొరగా అంతరించవలసిన సంస్థలు మరేవీ లేవు.

బాగా గమనించండి. ఈ హిందీప్రచారకసంస్థలు హిందూస్థానీల పెట్టుబడితోటీ, వారి పర్యవేక్షణం కిందా పనిచేస్తున్నాయి. వాటి జవాబ్దారీ హిందూస్థానీలతోటే గాని మరెవరితోటీ లేదు.

ఇక్కడివారు కొందరు వాటికి మేనేజర్లుగానూ, సెక్రటరీలుగానూ, వైస్‌ప్రెసిడెంట్లుగానూ, ప్రెసిడెంట్లుగానూ వుండడం

కాలములందును ఇంగ్లాండులో కోర్టు భాష ఫ్రెంచిఅయినా, కాలక్రమమున ఆంగ్లము, ఇతరభాషల సాయమూ సంపత్తీ పొంది వృద్ధి నందినది. థెమిస్టాకిల్సు, పెరికిల్సు, సోలన్ మున్నగు మహా విద్వాంసులే గ్రీకు జాతీయత్వాన్ని నిలబెట్టిరి. డాంటే, కర్లలో మున్నగువారు ఇటలీ నెట్లుద్ధరించిరో ఎరుగుదుము. హిందూదేశ చరిత్రనే చూడండి. ఎన్ని అల్లరులూ, ఎన్ని అరిష్టాలూ పొడగట్టినా మాతృభాషలను కడుపులోకంగాని, ఆత్మనాశనంగాని కలుగలేదు. ముసల్మానులు కూడా తెలుగునకెంతో ఆదరం చూపిరని, తెలుగు గ్రంథాలను కృతిపతులైనారని ఎరుగుదుము. సిథియనులు అనండి, గ్రీకులనండి, రోమనులనండి, పర్షియనులనండి, అరబ్బులనండి వీరు భారతి భాషలనణపలేదు. భారతభాషలనండి కొండంతబంగారము ను కొంపోయిరి. వానికి తామియ్యగల అపరంజినిచ్చిరి.

జాతికి ఆయువుపోసేది మాతృభాష. మాతృభాషకు జీవమిచ్చేది జాతీయత్వము. జనని జన్మభూములట్లు ఇవి కవలలైయుండును. వంగరాష్ట్రీయవాదులను కన్నతల్లియైనది వంగభాషోద్యమమే. సునీతి కుమార్ ఛటర్జీ వ్రాసిన వంగభాషా చరిత్రయను ఉద్గ్రంథమును పరిశీలించితిమేని, జాతీయత్వ వృద్ధికి మాతృభాష యెట్లు తోడ్పడుతుందో గ్రహిస్తాము. మనకు ఒక భాషాచరిత్ర లేదు: ఆంధ్రత్వమూ లేదు. ఆంధ్రత్వానికి తిలోదకాలు ముట్టితే, జాతీయత్వానికి ముట్టేవి ధర్మోదకాలు కావా?

తెలుగు మాట్లాడుట మాని హిందీనే ప్రయోగించండని కొందరు మహాశయులు చెప్పారని, కొన్ని సభాసంఘాలు శాసించాయని తెలుపుతూ ప్రబుద్ధాంధ్ర పత్రికా సంపాదకులు చాల దృష్టాంతాలను చేర్చినారు. న్యాయవాది వృత్తికి తగినట్టు నందుటచే ఏదృష్టాంతాలనుగాని, ఏ ప్రమాణాలనుగాని విమర్శించక, క్రాసు పరీక్షచేయక విడుచుట కష్టమైనది. పత్రికల్లో రిపోర్టులు అచ్చయిన అంశాలు అన్నీ వేదవాక్కులు కావని వీనిలో చాలమట్టుకు సగం నిజాలు, సగం ఊహలు అని పాఠకులెల్లరూ ఎరుగుదురు. శ్రీ శాస్త్రి గారు ఉదహరించిన సంగతుల్ని—అవి నిజాలు కావని యెవరు ఘంటాపథంగా చెప్పగలరు?—అని చూస్తున్నాను. శ్రీ శాస్త్రిగారు తెలిపిన దృష్టాంతము లను ఎవ్వరూ ఖండించనందున అవి సత్యేతరములని తలపను. హిందీపై ప్రయోగం చేయ్యమంటే మా బాగు అందును. నేను కూడ చేస్తాను ప్రశ్నకు సమాధానము కాబట్టి: కాని తెలుగును దూరంగా ఉంచి హిందీలో కొట్టుకొని చాపిస్తే, చెప్పనంటాను. తల్లిమాట కుత్తుకను ఉత్తరించమని కాంగ్రెసు చెప్పలేదు కాని మనవాళ్లు మాచిరిన్నంటే కాల్చివెయ్యడానికి సిద్ధపడుతున్నారు, మాతృభాష లోనే ప్రబోధం జరగాలని, తెలుక్కి రవాణెన్నా రావలసిన వేళయిందని కొందరు ఘోషపెడుతూవుంటే.—ప్రాచీన గ్రామ స్వపరిపాలనా విధానాలను తల్లిమాటయందు నేర్చి జాతీయత్వ పునరుద్ధరణానికి పాటుపడండని వేడుకొంటూవుంటే తెలుగక్షరాల మాట దేవుడెరుగును, హిందీ నేర్చుకోయ్యండోయి సోదరులారా అని గ్రామస్థులను, చదువుసంధ్య లెరుగని వాళ్లను, ఏదికూడునో ఏదికూడదో, ఏదివినతగినదో ఏదివినతగనిదో ఎరుగనివారిని ప్రోత్సహించడం ఉచితంకాదు. తెలుక్కి కాక, యీ ప్రోత్సాహం కాంగ్రెసువారి వుద్దేశానికి, జాతీయత్వానికే భంగం తెస్తుంది. జాతీయత్వంలో ఎవ్వరికీ తీసిపోని బంగాళీలను చూడండి. తెలుగునకంటె, బంగాళీభాషకూ, హిందీకీ దగ్గరచుట్టరికం ఉంది. అయినా బంగాళీలు హిందీపై శత గోపం పెట్టించుకుని సమ్మతించడం లేదు. ఒకప్పుడు అలహాబాదులో కొందరు బిపిన్ చంద్రపాలును హిందీలో ఉపన్యసించ మంటే "ఊహూ!" అన్నాడు. శ్యామసుందర చక్రవర్తిమాత్రం కొంతకాలం గాపులగపు హిందీతో హిందీ సభ్యులమాంద్యం ఉపన్యసించేవాడు. హిందీని వారు నేర్చుకొమ్మని అనరు; వద్దూ అనరు. వద్దని చెవిలో చెప్పే బంగాళీపెద్దలున్నారు. హిందీని మాతృభాషగా కలవారిని బంగాళీ నేర్చుకొని, దానిలో వుపన్యసించండని ప్రోత్సహించేవారున్నారు. బరాబజారు కాంగ్రెసు సంఘానికి అధ్యక్షులుగా వుండి చాలకాలం నుంచి దేశసేవచేస్తూవున్న, పెద్దగిరిజాల పురుషోత్తమశర్మ అనే హిందూస్థానీయుడు తరచుగా బంగాళీలో వుపన్యసిస్తాడు. బెంగాల్ విజిలెన్సు సొసైటితో సన్నిహిత సంబంధముకల ఏండర్సన్ అనే ఆంగ్లేయుడు బంగాళీలో వుపన్యసిస్తాడు. 'సోనార్ బంగ్లాభాష' (బంగారు బంగ్లాభాష) తలవాకే మరేభాషైనా నిలబడాలని వాంఛీయులవాదన.

• హిందీప్రచారానికి ఒక్కొక్కని కార్యక్రమం ఉంది. పాఠశాలల్లోకూడ ప్రచారం జరుగుతోంది. మొన్న జరిగిన హిందీ వారంలో కొందరు హిందీలోనే—వ్యాకరణపు పట్టింపు అట్టే అక్కర్లేదని—ఉపన్యాసాలిచ్చారు. తెలుగులో ఓ నమూలనుమాచి ఎరుగని అభాగులు. కొందరు హిందీవుపన్యాసాలువిని, దీనిలో ఏదో సిద్ధాంతం, ఏదో అద్భుతమైన అభ్యుదయం ఉందని యోచించి హిందీకై ఆణులు చాపుతున్నారు. "తెలుగురానిదే, హిందరాదు. తెలుగు నేర్చి, హిందీ నేర్చుకొండి"ని ఎవ్వరూ వీరికి ప్రబోధము చేయుటలేదు. హిందీ వారికి వలెనే, తెలుగువారమును. తెలుగువారమే కాదు తెలుగుపక్షము మహాసంరంభంతో జరిగితేనేగాని, తెలుగుమీద పల్లెవాసులకు అనురాగం కుదరదు. చెడుగులోనుంచే మంచి వస్తుందని అంటారుకదా. ఉద్దేశపూర్వకంగానో, అన్యాపదేశకంగానో కొందరుచేసే కృషివలన నేడు తెలుక్కి జరుగుతోవున్న అపకారాన్ని మాపుచెయ్యాలంటే ఆంధ్రభాషోత్సవాలను జరుపుట అని నావ్యం. ఆంధ్రులందరూ కూడి ఈ ఉద్యమానికి కలసిన కార్యక్రమం ఒకటి అచిరములో లేవనెత్తవలెననే నా అభిప్రాయం. భాషోద్యమంలో నుండి జాతీయపునరుద్ధరణానికి తోడుపడే ఉద్యమాలెన్నో పుట్టును. ఆంధ్రధర్మము నిరవేరినపుడు జాతీయధర్మమూ నెరవేరుతుంది.

# గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు

చిక్కనైన నిరసనతోటీ, తిరస్కరించిన ద్వేషంతోటీ, గడ్డకట్టిన ప్రాతి కూల్యంతోటీ పరిసరాలన్నీ మజ్జిడ్డుగా వున్న పరిస్థితుల్లో ఏటికి ఎదురీది జీవితసాఫల్యం పొందిన ఆధునికాంధ్రులు కైలాసవాసి కందుకూరి వీరేశలింగంపంతులుగారి తరవాత గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారొక్కరే కనపడుతున్నారు.

తలుచుకుంటే శరీరం జలదరిస్తోంది.

దేశంలో చారిత్రికజ్ఞానం ఏమీ లేదు. కాలం మార్పులు తెచ్చి పెడుతుందనే సత్యం అవగాహన కాలేదు. హేతువాదానికి నిలవనీడ లేదు. కేవలమూ వృద్ధప్రపితామహుల దగ్గిరనుంచీ సంక్రమించిన గడ్డసమ్మకం తప్ప మరేమీ లేని రోజులవి. అలాంటి సమయంలో — ఇరవైయైదు సంవత్సరాల కిందట రామమూర్తిపంతులుగారు వ్యావహారికాంధ్రభాషావాదం చేపట్టి గిడసబారిపోయిన పండిత వలయంలో వురికారు.

పంతులుగారికి వెనకఆసరా ఏమ్ట్యుగా లేకరు. శ్రీనివాస అయ్యంగారొకరు, గురజాడ అప్పారావుపంతులుగారొకరూను.

కానైతే యీ మగ్గురూ కూలంకషప్రజ్ఞావంతులే: అయినా పండితులు యీ వర్గాన్ని చూసి హేళన చేశారు.

కలం పట్టినప్పటినుంచీ బ్రౌఢ్యం తిరగవేసే పండితులకి ఏట్యు గారు ఖండాంతరులైపోయారు. అయ్యంగారిదగ్గిర చిరకాలం విద్యాభ్యాసం చేసిన ఆంధ్రజాతికి వారు ఆరవవారైపోయారు. ఇక అప్పారావుగారా? ఆయన వొక రాజకూతురికి పూడిగం చేస్తూ ప్రహసనాలు రాసుకునే మనిషి.

ఇంకేం వుందీ? పండితులంతా పంతులుగారి వాదాన్ని కుప్పి గంతులుగా భావించారు. "ఏమీ పని లేదా ఏమిటి?" అంటూ కసుర్కున్నారు. "విశాఖపట్నంనుంచి తప్పించుకుని పారిపోయి వచ్చారు కాబోలు." అని జాలితలిచారు.

అప్పటికప్పుడే పంతులుగారికి 'బ్రహ్మచెవుడు' ముదిరిపోయింది. ఎలుగురానీన పండితుల కంఠధ్వనులు పంతులుగారి చెవిదాకా వెళ్లలేదు.

పండితులు పంతులుగారిమీద శ్లేషలు కురిసేశారు. వ్యంగ్యాలు విస్ఫురించేశారు. దీవనలు గుమ్మరించేశారు. కాని అవి కొండగుహల్లో ప్రతిధ్వనించినట్టు పండితుల చెవుల్లోనే గింగురుమన్నాయి.

విసిది లేక పండితులు కలాలు పట్టారు. వెంటనే పంతులుగారు బ్రౌఢ పెన్సులు పుచ్చుకున్నారు.

మొత్తానికి వొక్కొక్క పండితుడి, వొక్కొక్క పుస్తకంలో రెండు—మూడు— వేల తప్పులు. శ్రీకారం చుట్టడానికి కలం యెన్ని తప్పులు తిప్పాలో పండితు లెరగరని పంతులుగారు టాకాయించి చెప్పారు.

కాని ప్రభుత్వం పండితుల వాదానికే చేయూత యిచ్చింది.

పంతులుగారి మార్గానికి పర్వతం అడ్డుతగిలింది, నిజమే; కాని వారు జంకలేదు. అడుగు వెనక్కి వెయ్యలేదు.

అవును. ఎందుకు జంకాలీ? ఎందుకు వెనక్కి తియ్యాలీ?

గమ్యం గమ్యంగానే వుంది. దాని కేమీ విఘాతం కలగలేదు.

తెనుగుతల్లి "రావోయి నా మనవా, యీవేపునుంచి రావోయ్" అంటూ ప్రేమతో చేతులు చాపింది;

వెంటనే పంతులుగారు దారి మార్చారు. ఈసారి వారికి అప్పారావుగారి కలం పూర్తిగా సాయపడింది.

వ్యావహారికభాషకి స్వాధీనవాక్కు భుక్తాల్లోంచి తప్పిపోయిన గురుపీఠాన్ని మళ్ళీ దఖలుపరచినావారీయిద్దరే.

అయితే: వొక్క చిన్నభేదం మాత్రం వుంది.

రామమూర్తిపంతులుగారు భాషయొక్క పూర్వోత్తరాలన్నీ క్షుణ్ణంగా తెలిసిన పండితులు. పెద్దపెద్ద సభల్లో మహామహోమైన గాళ్లని "గుర్రందిగూ" అంటూ వురిమి కిందికి లాగేసిన సరదారు.

అప్పారావుగారు శబ్దశక్తి తెలిసిన రచయితలు. రసనిద్ధిపొందిన భావుకులు.

రామమూర్తిపంతులుగారి సింహగర్జనలు భాషాతత్వాన్ని బోధపరిచాయి.

అప్పారావుపంతులుగారి కవిత వ్యావహారికభాషలోవున్న జీవకళా మాధుర్యమూ, రసస్ఫూర్తీ, శక్తీ వెల్లడిపరిచింది.

ఇలాగ అగర్జనలవల్ల సత్యం వెల్లడికాగా యీకవితవల్ల సుమారకవిసింహాలకు నూతనావేశం కలిగింది.

ఇంకేం కావాలీ?

ఆంగ్లవాఙ్మయపరిచయంవల్లా, వివిధదేశపర్యటనాలవల్లా కొత్త పోకడలు పోతూవున్న యువకవులంతా వ్యావహారికభాషలోనే గ్రంథరచన ప్రారంభించారు. దేశీయులు ఆంధ్రభాషయొక్క నిసర్గమాధుర్యాన్ని అనుభవిస్తూ జానుతెనుగు నుద్ధరించిన పంతులుగారి పరిశ్రమని గుర్తించారు.

ఇదే మొన్నటి (౧౯౩౩) డిసెంబరు ౨౩డో తేదీని రాజమహేంద్రవరంలో నన్నయ్యగట్టు స్నానాలు చేసి జపం చేసిన గోదావరి వొడ్డున కార్యరూపం తాల్చింది.

ఆంధ్రజాతి అంతా అక్కడ కూడింది. ఆంధ్రుల వైభవం అంతా అక్కడ కొలువు తీరింది. ఆంధ్రుల రసికత అంతా అక్కడ గుబాళించింది.

ఆనేళ రాజమహేంద్రవరంలో (పరిషద్వార్షికోత్సవంలో) పంతులుగారికి చోటు లేకపోయింది. ఇవాళ రాజమహేంద్రవరం అంతటా పంతులుగారి తేజస్సు నిండిపోయింది.

ఆనేళ పరిషత్తు పంతులుగారికి అంతు చెప్పింది. ఇవాళ దేశం పరిషత్తుకే అంతు చెబుతోంది. —శాస్త్రి (భారతి)

# వ్యాఖ్యానములు

## వేశ్యల కొక సలహా

మొత్తంమీద యిప్పుడు భోగంమేళాలకు గిరాకీ తగ్గిపోయింది.

గొల్లవేషాలూ, భామకలాపాలూ కూడా చాలా అరుదయి పోయాయి.

ఈవిధంగా భారతీయ లలితకళలలో నిగ్గయింది వొకటి తుడిచి పెట్టుకు పోతోంది.

'భరతనాట్యం' అంటూ వొకటి వినపడుతోంది; కాని అది గాలికబురు.

సంస్కర్తల ధర్మమా అని వేశ్యల బాలికలు మగనాళ్లయి పోతున్నారు.

బాగానే వుంది... .....అయితే......

సానరికంలో ప్రవేశపెట్టబడుతూ వున్న బాలికల సంఖ్య కొద్దిగానే వున్నా, ఇదివరకే సాను లయిపోయివున్న యువతులూ, ప్రౌఢలూ, జాతలూ పుష్కలంగానే వున్నారు.

వీరికి వివాహవాంఛ లేదు. వుండినా సాధ్యం కాదు. అయినా ఔచిత్యం వుండదు.

అయితే: ఇలాగ మేజువాణీలూ లేక, భామకలాపాలూ లేక, గొల్లవేషాలూ లేక, చివరకి పెళ్లిళ్లు అయే మార్గాలూ లేక—యీ సానల కిక జీవనం యేమిటి?

సంస్కర్తలు కాదు ఎవ రెంత ప్రయత్నించినా యీ సానులకు పురుషవాంఛ తగ్గదు. వ్యభిచారం సాగుతూనే వుంటుంది.

ఆమాటకి వస్తే వేశ్యలలో వివాహాలు ప్రబలేక—ఆ కారణంవల్ల కాకపోయినా సంసారులలో వ్యభిచారం ఎక్కువయిపోయింది.

అంటే వేశ్యలలో విద్యలు నశిస్తున్నాయే; కాని వేషాలు ముదిరిపోతూనే వున్నాయి. కళానుశలత దిగజారిపోతోందే కాని వ్యభిచారం నిలిచే వుంది.

లోకవృత్తం చూస్తేగా సంస్కర్తలకు మేజువాణీలు తగ్గించడంతోటే పని అయిపోయినట్టుంది; కనక వేశ్యలేనా తమ విషయం కొంచెం యోచించుకోవాలి.

ఆటపాటలు లేకపోయినా కాయికసుఖానికి అడ్డుండదు. కూడు గుడ్డలకి లోపం రాదు. అయితే, ప్రశ్న యేంకావాలి? చాతుర్యమూ, యుగయుగాలనుంచి రక్తంలో జీర్ణించివున్న ప్రాగల్భ్యమూ—వీటిని గోదావరిలో కలిపెయ్యవలసిందేనా?

ఎన్ని దోషా లంటిపెట్టుకుని వుండినా వాటిని కప్పిపుచ్చుతూ సభ్యత—సభాగౌరవం కలిగిస్తూ వున్న అభినయకళని బుగ్గిచేసెయ్యవలసిందేనా!

బెంగపెట్టుకోనక్కరలేదు. కళ యెప్పుడూ కళగానే వుంటుంది. రకం మారినా రాశితరగదు. అందులోనూ యివి స్త్రీలకు కొత్త చైతన్యం ప్రసాదించే రోజులు.

మేజువాణీలు తగ్గాయి; కాని నాటకాలు హెచ్చిపోయాయి.

కుల స్త్రీలు కూడా నాటకాలలో అభినయిస్తూ పేరూ, గౌరవమూ తెచ్చుకుంటున్నారు.

పూనుకుంటే యీ వేశ్యలకు నాటకరంగంలో అగ్రపీఠం కని పెట్టుకొని వుంది.

మేజువాణీలు తగ్గిపోయినట్టుగానే నాటకాలలో స్త్రీలే స్త్రీ పాత్రలు ధరించా లనే వాదం ఆచరణలోకి వచ్చేసింది.

అక్కడక్కడ వేశ్యలు కొందరు తమ హక్కులు స్వాధీనపరచుకుంటూనే వున్నారు.

కనక సానులుగా వున్న వేశ్య లందరూ నాటకరంగంలో ప్రవేశించాలి.

దీనితో నాటకాలకు జీవకళ వస్తుంది.

ఇంకొక్క విశేషం కూడా వుంది. స్త్రీవేషం పురుషులు వేసినా స్త్రీలు వేసినా అందుకు అందరూ యౌవనం దాటనివారే నిగ్గపడుతున్నారు. వయస్సుమళ్లి స్త్రీవేషం వెయ్యడానికేనా పనికిరాకపోయిన స్త్రీవేషం వెయ్యాలన్నా వారే తయారు. దీనివల్ల నాటకాలు బూటకాలు అయిపోతున్నాయి. వేశ్యలు రంగస్థలం స్వాధీనపరుచుకుంటే ఆబాధ వుండదు. ఇప్పుడు సానులు అన్ని వయస్సులవారూ వున్నారు. మరి ముందుమాటేమి టంటే దేశంలో సానరికం అనేది నశించిపోయేటప్పటికి అభినయము కుల స్త్రీలలోనే వేళ్లుతన్నుకుంటుంది.

ఇలాగ వేశ్యలు నాటకరంగాన్నుద్ధరించినవా రవుతారు.

ఈసలహాను వేశ్యలు కొంచెం శ్రద్ధగా గమనిస్తా రని నమ్ముతున్నాము.

## కీటకం ప్రవేశించింది

చివరకి, కాలేల్కరు గారికి, కన్నడదేశంలో నేనా వొక పెట్టు కిందికి దిగక తప్పింది కాదు.

అదిగడంలో మాత్రం వారు చాలా బెట్టుసరిగానే కాలు కదిపారు. మాట చెల్లుబడి అయే స్థితి రావడంతోటే యెలాంటివాళ్ళని గూడా ప్రతిష్ఠాపించాచం అవహిస్తుంది కాబోలు.

"......కాని దక్షిణదేశములో హిందీభాషను బోధించుట యందు మాపద్ధతులలో కొన్ని లోపము లుండవచ్చును" ట.

ఏం? హిందీవల్ల దక్షిణదేశభాషలకు అపకారం జరుగుతోందని, అసలీ ప్రాతికూల్యం యెక్కడ బయలుదేరిందో యెక్కడ పూర్తిగా గుర్తించబడ్డదో అక్కడ—తెనుగుదేశంలోనే యీసంగతి వొప్పుకుంటే యేం?

కాలేల్కరుగారు "యీ ముఖ్యసమస్యను పరిష్కరించుటయందు కన్నడరాష్ట్రీయుల తోడ్పాటును కోరుచున్నా"రుట. మంచిదే.

వొక పుష్పమాల తీసుకుందాం. అందులో వున్న ప్రతీ పుష్పానికీ ప్రత్యేకత వుంది. అదే దానికి అస్తిత్వాన్ని ప్రసాదిస్తోంది; కాని ఆ ప్రత్యేకతలోనుంచే ఐక్యం కలిగించే సూత్రాలకి ప్రతీ పుష్పలోనూ అవకాశం పూర్తిగా వుంది. అలాగే హిందూదేశంలో భాష ననుసరించి రాష్ట్రాలు విడివిడిగా వున్నాయి; వాటి అన్నిటిలోనూ భారతజాతీయతకి స్ఫుటమైన అనుబంధం వుంది.

ఇప్పుడు హిందూదేశం వొక కేంద్రప్రభుత్వంకిందే వున్నా రాష్ట్రాలుగా విడిపోయికూడా వుంది. మనకి సంపూర్ణ స్వరాజ్యం వచ్చిన తరవాత కూడా యీ పద్ధతి తప్పదు. అలాంటప్పుడు ఆరాష్ట్రాలు భాషలను పట్టే నిర్మించబడడం చాలా మంచిది కాదూ?

ఇవతలి మనిషి యెంత మంచివాడయినా, అవతలివాడు కూడా యెంత సాకలీడివాడయినా వ్యాకరణంలో విశిష్టత వుంటే గాని ఐకమత్యం కలగదు. ఇక్కడ మహమ్మదీయుల్నీ మనల్నీ రాష్ట్రాలు విడదీయ్యడం లేదు. భాషకూడా బద్దలుకొట్టడం లేదు. సంప్రదాయాలు విడదీస్తున్నాయి. దృక్పథాలు చీల్చేస్తున్నాయి. భారతీయత యేమీ సలామణీ కాలేకపోతోంది.

వొకటి చూస్తే తెలుస్తుంది, వొకచోటే వున్న హిందువులకీ, మహమ్మదీయులకీ కవకలకడం లేదు. భిన్నరాష్ట్రాలలలో వున్న మహమ్మదీయులు ఏకమవుతున్నారు. హిందువులు అంత సమైకం కాలేకపోయినా చివరికి వొకటిగానే భావించుకుంటున్నారు.

ఏం?

ఈ వొక్క విదర్శనమూ చూసుకొని వుంటే సూంజగారు ఈవాదం ప్రారంభించి వుండరు.

ఇప్పుడిప్పుడే తోడుకుంటూ వున్న మన ఆంధ్రరాష్ట్రవాంఛకి మూంజగారి సలహావల్ల అపాయం కలగదని నమ్ముతున్నాం.

## లండనుకు తెనుగు రాయబారం

గంజామాంధ్రభూభాగం ఓఢ్రరాష్ట్రంలో కలిసిపోకుండా వుండాలంటే మనవాళ్ళు లండనుకెళ్ళి తీవ్రంగానూ, శ్రద్ధగానూ పనిచెయ్యాలనే సంగతి చాలా మాసాలకిందటే నిర్ధారణ అయిపోయింది. ఆలస్యం అయినకొద్దీ నష్టం కూడా పెనవేసుకుపోతూనే వుంది. కాని యింతవరకూ రాయబారులు బయలుదేరలేదు. బయలుదేరతామన్నవారికి కావలసిన డబ్బు సమకూడలేదు.

ఎవరూ వుత్సాహపడినట్టు కనపడలేదు.

సమకూర్చడానికి గట్టిగా నడుములు కట్టినవారు కూడా లేరు.

ఎం చేశాం?

అంత దరిద్రస్థితిలో వుందా మనజాతి? మనలో పని చెయ్యగలవారు లేకపోయేరా?

ఇదేమీ కాదు. మనలో వుండల్లా వొక్క ఆంధ్రత్వమే.

ఆంధ్రభాష వికసించడానికి పదులేనా ఇవ్వని ఆంధ్రులు హిందీ ప్రచారానికి వేలు దాఖలు చేసుకుంటున్నారు. రాయలసీమక్షామపీడితులకు గంజేనా పొయ్యకుండా వున్నవారు బీహారుభూకంప పీడితులకోసం లక్షలు యెగువతీ చేశారు.

ఇంతెందుకూ? గంజామాంధ్రులకు చేయూత యివ్వకుండా మొగం తప్పించుకుతిరుగుతూ వున్నవారు బార్డోలీ రైతులకోసం జెయిళ్ళకి వెళ్ళారు.

ఇప్పుడు మళ్ళీ యేగుజరాతీలదగ్గరనుంచో, యేహిందూస్థానీల దగ్గరనుంచో తాఖీదులు వచ్చాయంటే మన ఆంధ్రులు లక్షలు గుమ్మరిస్తారు. ఎందుకోసమైనా సరే చివరికి సత్యమూర్తిగారు చీటిపంపినా వేలు బటువాడా చేస్తారు మనవారు.

దీనికల్లా వొకటే కారణం.

మన ఆంధ్రులు కార్యనిర్వాహకులు కారు. ఏకార్యమూ వీరు ప్రారంభించి నిర్వహించలేరు.

మన ఆంధ్రులు అనుకరణపరాయణులు. ఇతరపరగణాలవారేం చేస్తే వారివెనకాల పరిగెడుతూ మనవారు అదే చేస్తారు. చెయ్యడంకంటే కబుర్లు ఎక్కువ చెబుతారు.

నిన్నగాక మొన్నగూడా గంజాంజిల్లాలో ప్రత్యేకాంధ్రసభ జరిగింది; కాని ఫలితం వుండదు. ఉండడమే వస్తే—అంటే రాయబారులు వెళ్ళడమే వస్తే ఇండియాబిల్లుచట్టంఅయిపోయాక వెడతారు.

గంజామాంధ్రభూభాగం ఆంధ్రదేశంలోనే వుండిపోవాలంటే దానికి ఈశ్వరానుగ్రహం వొక్కటే ఆధారంగా కనపడుతోంది. అంతే.

## ఒక్కొక్క రూపాయి వాటాలు

తెనుగుదేశంలో, రమారమీ రెండునెలలనుంచి లవకుశ ఫిలుము తెయితక్కలాడుతోంది.

కళాదృష్టితో చూస్తే తోలుబొమ్మలాటకంటే అది అట్టే పై రకతిలో లేదు; కాని దాన్ని చూడడానికి మనవారు కాళ్లు విరగతొక్కుకుంటున్నారు.

పర్యవసానం......?...మనవారికి సహజంగా వున్న కళాభ్రాంతి చచ్చిపోవడమూ, ప్రతిదినమూ, తెనుగుడబ్బు కలకత్తా మార్వాడీ గొడాములోకి నల్లగా జారిపోతూవుండడమూనూ.

“మనం కట్టుకునే బట్టనాంచెస్టరునుంచి యెందుకు రావాలి?” ఇలా అడిగేవారున్నారు. నిజమే. ఇక్కడా యిదే సూత్రం.

మన తెనుగుఫిలుము తెనుగుదేశానికి అవతల యెందుకు తయారు కావాలి? తెనుగు ఫిలుముపేరుపెట్టి మన డబ్బు అన్యదేశవుని గొడాములు ఎందుకు నింపాలి?

విషయం యిదీ. ఉద్యోగాలు లేక అల్లాడుతూవున్న యువకు అంతా యేంచేస్తున్నారు?

ఒక్కొక్క రూపాయి వాటా యేర్పరచినా వొక పక్కా తెనుగు స్టూడియో ఏర్పాటు చేయవచ్చు. ఫలిస్తుందా? అవొకరూపాయీ పిల్లలు పెడుతుంది. లేదూ? కనపడని పోదరు. దీనితో ముందు పౌరుషం అబ్బుతుంది. పరిశ్రమకి దారి యేర్పడుతుంది. తెనుగుతనం నిలుస్తుంది. తెనుగుడబ్బు ఎలాగా ఖర్చుపడుతూనే వుంది. అయితే నిర్మాణకుశలుడు ఎవరేనా “నేను” అని ముందుకువస్తే అది మళ్ళీ తెనుగుజేబుల్లోకే వస్తుంది.

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి *** రాజమహేంద్రవరము

నవలలు–నవరసభరితములగు నవలలు–ముచ్చటగూర్చు బొమ్మలతో–ముద్దులొలుకు క్యాలికో బయిండుతో–రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7–8–0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజస్టర్డు పార్సిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

- 11 ప్రేమసుందరి 1 8 0
- 12 చోరశిఖామణి 1 8 0
- 13 లక్ష్మీప్రసాదము 1 8 0
- 14 హత్యారహస్యము 1 8 0
- 15 ఫాస్టు (1 భాగము) 1 8 0
- 16 ఫాస్టు (2 భాగము) 1 8 0
- 17 కుముద్వతి 1 8 0
- 18 చిన్నకోడలు 1 8 0
- 19 రహస్యభేదనము 1 8 0
- 20 సింహగడము 1 8 0
- 21 మణిహారము 1 8 0
- 22 మొగలాయిదర్బారు 1 భాగము 1 8 0
- 23 ఘటనాచక్రము 1 8 0
- 24 రాజసుందరి 1 8 0
- 25 కుంకుమభరణి 1 8 0
- 26 జాగిలము 1 8 0
- 27 మొగలాయిదర్బారు 2 వ భాగము 1 8 0
- 28 సరస్వతి 1 8 0
- 29 ఆనందాభాయి 1 8 0
- 30 హత్యాన్వేషణము 1 8 0
- 31 మొగలాయిదర్బారు 3 వ భాగము 1 8 0
- 32 గంగ 1 8 0
- 33 మొగలాయిదర్బారు 4 వ భాగము 1 8 0
- 34 కోహినూరు 1 8 0
- 35 ఆటీన్‌మణేలా 1 8 0
- 36 అపరిచిత 1 8 0
- 37 అంతఃపురము 1 భా॥ 1 8 0
- 38 అంతఃపురము 2 భా॥ 1 8 0
- 39 అగ్రహారము 1 8 0
- 40 ఛిన్నహస్తము 1 భా॥ 1 8 0
- 41 ఛిన్నహస్తము 2 భా॥ 1 8 0
- 42 కంకణరహస్యము 1 8 0
- 43 సంజీవి 1 భా॥ 1 8 0
- 44 సంజీవి 2 భా॥ 1 8 0
- 45 వ్రజరాణి 1 8 0
- 46 హత్యాభ్రమ 1 8 0
- 47 కాళఖండము 1 8 0
- 48 సేవాశ్రమము 1 భా॥ 1 8 0
- 49 సేవాశ్రమము 2 భా॥ 1 8 0
- 50 దాసీకన్య 1 8 0

## అనుబంధములు

- 1 నృత్యరంగిణి 0 12 0
- 2 అభాగిని 0 12 0
- 3 ఛద్మవేషి 0 12 0
- 4 విదురుని యువదేశములు 1 0 0
- 5 కాంచనమాల 1 0 0
- 6 సీమంతిని 1 0 0
- 7 సుశీల 1 0 0
- 8 శశిరేఖ 1 0 0
- 9 యమునాబాయి 1 0 0
- 10 శ్యామల 1 0 0
- 11 కాంతంకథలు (చిన్నకథలు) 1 0 0
- 12 కాలసర్పి 1 0 0
- 13 భారతకథాసారం 1 0 0
- 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) 1 0 0
- 15 అరక్షణీయ 1 0 0
- 16 మాధవి 1 0 0
- 17 లలిత 1 0 0
- 18 పెండ్లిదండ 1 0 0
- 19 కథావళి 1 0 0
- 20 నాలుగుకథలు 1 0 0
- 21 నీతిప్రబోధిక 1 0 0
- 22 ఆదర్శము 1 భా॥ 0 12 0
- 23 ఉదంకుడు 0 12 0
- 24 భేతాళకథలు 0 12 0

## నాటకములు

- 1 మార్కండేయ 0 12 0
- 2 అహల్యాశాప విమోచనము 0 12 0
- 3 మేవారుపతనము 1 0 0
- 4 వరమాల 1 0 0
- 5 షాజహాను 1 0 0
- 6 నూర్జహాను 1 0 0
- 7 దుర్గాదాసు 1 0 0
- 8 చంద్రగుప్త 1 0 0
- 9 దంపతులు 1 0 0
- 10 విజయవిజయం 1 0 0
- 11 భక్తకుచేల 1 0 0

ఈ గ్రంథములు రాజమండ్రిలో కళాభివర్ధనీ పరిషత్తులలోను దొరకును.

**కటుకరోహిణీ:—కటుకా—Picrorrhiza kurroa Veronicalindleyana.**

**పరిచయపదములు:** శతపర్వా - చాలా గణుపులు గలది. కాండరుహా-కాడయే మొలచునది. చక్రాంగీ - ముక్కగొట్టిన చక్రాకారముగ నుండునది. గుణబోధినీపదములు: ఆమఘ్నీ - ఆమదోషమును పోగొట్టునది.

**స్వరూపము:** ఇది గుల్మజాతిలోని మొక్క. ఆకులు కొంచెము పొడవుగను, రంపపుపండ్ల వంటి అంచులు కలిగి కుక్కపొగాకు ఆకులవలె నుండును. దీని పూవులు నీలిరంగు గలిగి గుత్తులుగా నుండును. దీనిలో రెండు జాతులు కలవు నీలిరంగుగల దొకటియు, పచ్చరంగుగల దొకటియు. హిమాలయ ప్రాంత ప్రదేశములలో నిది విస్తారముగా నుండును. దీని వ్రేళ్లనే యౌషధములకు వాడుదురు.

**గుణములు:** ఇది చేదురుచి గలిగి యుండును. వేడిచేయు స్వభావము గలది. విపాకమున కారపు రుచిగ మారును. రూక్షలఘుగుణములు కలది. బాగుగా విరేచనమును జేయును. అగ్నిదీప్తిని గలిగించును. హృదయమునకు హితకరమైనది. కఫ పిత్తజ్వరములను హరించును. ప్రమేహములు శ్వాస కాసలు, రక్తతాపము, కుష్ఠరోగము, క్రిములు హరించును. విషమజ్వరములను పోగొట్టును.

**ప్రయోగములు:** హృద్రోగమునకు:— కటుకరోహిణి, యష్టిమధుకమును మెత్తగా నూరి పంచదారనీళ్లతో కలిపి త్రాగిన హృద్రోగములు శమించును.

స్తన్యశుద్ధికి:—దీని వేళ్లు పాలతో గాని నీళ్లతో గాని నూరి త్రాగిన స్తన్యము శుద్ధమగును.

కఫపిత్తజ్వరములకు:—కటుకరోహిణి ఉసిరికాయంత ముద్ద వేడినీళ్లలో కలిపి కొంచెము పంచదార వేసి త్రాగిన క్రిములను పోగొట్టి విరేచనమును జేసి జ్వరములను తగ్గించును.

ఎక్కిళ్లకు:—గైరికమును, కటుకరోహిణియు సమానములుగ చూర్ణించి తేనెతో కలిపి యిచ్చిన ఎక్కిళ్లు శమించును. (సుశ్రుతము)

కటుకరోహిణి కషాయములో నవాసాకు చూర్ణము కలిపి మూడు రోజులు తెల్లవారుజామున నే త్రాగిన ఋతురక్తము జారీయగును. కటుకరోహిణి గుంటకలగరాకు రసముతో నొక వారము దినములు మర్దించి కందిగింజలంత మాత్రలు చేసి అల్లపురసముతో నిచ్చిన చలిజ్వరములు కట్టును. చిత్రినాగమట్ట రసముతో కటుకరోహిణిని మెత్తగా నూరి గుండెలకు పట్టువేసిన గుండెలలో పీకునొప్పి తగ్గుటయే గాక, శ్లేష్మము కరగి ఆయాసము తగ్గును. లోని కిచ్చు మోతాదు ఎక్కువైనచో వికారము గలిగించును. కటుకరోహిణిలో రెండువరకములు తెల్లది నల్లదానికంటె తీక్ష్ణమైన గుణములను గలిగి మిక్కిలి విరేచనమును జేయు స్వభావము గలిగి యుండును. వాడుకలో నల్లదానికంటె తెల్లది తక్కువ మోతాదుగనె వాడవలయును. లేక వికారము వాంతియును గలిగించును దీనిని పైన పట్టువేసినచో పొక్కును. దీనికి బానమునూనె గాని వవ్వగాని విరుగుడువస్తువు.

**నవీన వైద్యక మతము:** ఇది రసాయనము. చేదురుచి, పాచనకారి, పైత్యహరము. అజీర్ణము, గ్రహణి, శ్వాస, పిత్తవికృతులు, కామల మొదలగు రోగముల యందు దీనిని బాగుగా వాడవచ్చును. యకృద్వృద్ధిలో నిది చేదుపుచ్చతో సమానముగా పని చేయును. చేదుపుచ్చకంటె ఇది మృదువుగా పని చేయును. విషమజ్వరముల కిది యుత్తమమైన యౌషధి. పిల్లల క్రిమిరోగములయందు కటుకరోహిణి బాగుగా పనిచేయును. (మెటీరియా మెడికా ఆఫ్ ఇండియా. R. N. Khory part II, P. 457.)

# అమృతాంజనము

అన్ని నొప్పులను

బాధలను కుదుర్చునని

<u>తమకు తెలియును</u>

<u>అయిన తెలియవలసిన దేది !</u>




నేడు దేశమంతటను కుక్కగొడుగుల వలె తలలెత్తిన నకలు మందుల చూచి మోసపోకుండుటయే !

బజారులలో కొనుటకు పూర్వము మా ట్రేడు మార్కు గుర్తులన్నిటిని జాగ్రత్తగా పరిశీలించుడు.

# ఆధునికాంధ్ర వాఙ్మయము

మావద్ద నవీనకవుల గ్రంథాలన్నీ దొరకును. రూపాయకు తక్కువఖరీదు పుస్తకాలు వి.పి.గా పంపము. పోస్టుఖర్చులు కొనువారే భరించా.

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి

- వీరపూజ—చరిత్ర ౦ ౧౨
- రక్షాబంధనము—డిటెక్టివునవల ౧ ౦
- శ్మశానవాటిక—డిటెక్టివునవల ౦ ౧౨
- మిథునానురాగము—చారిత్రికనవల ౧ ౦
- అనాథబాలిక—సాంసారికనవల ౦ ౬
- వారకాంత—నాటకము ౦ ౧౨
- విజయనగరరాజులకథలు ౦ ౨
- చిత్తూరురాజులకథలు ౦ ౩
- ఢిల్లీచక్రవర్తులకథలు ౦ ౩
- గోల్కొండనవాబులకథలు ౦ ౨
- శృంఖల—విమర్శగ్రంథము ౦ ౧౨

## డా. చిలుకూరినారాయణరావుగారివి

- జర్మనిదేశపువిద్యావిధానము ౧ ౦
- అంబ_లేక వెండిశిఖండి_నాటకము ౧ ౪
- సంస్కృతలోకోక్తులు ౧ ౦
- అశ్వత్థామ—అచ్చి—౨ నాటకాలు ౦ ౧౨
- అశోకుని ధర్మశాసనములు ౨ ౦
- ఉమార్ ఖయ్యామ్—రుబాయత్ ౦ ౮
- ఉపనిషత్తులు ౦ ౬

## చింతా దీక్షితులుగారివి

- శబరి—కోతినాటకము ౧ ౦
- ఏకాదశి—౧౧ చిన్నకథలు ౦ ౧౨
- పరిణామవాదము—తన్నిదర్శనములు ౦ ౧౨

## గుడిపాటి వేంకటాచలంగారివి

- మాకొద్దీతెల్లదొరతనం? ౦ ౧౨
- బిడ్డలశిక్షణ ౦ ౮

## నోరి నరసింహశాస్త్రిగారివి

- గీతమాలిక ౦ ౧౨
- సోమనాథ విజయము ౦ ౧౨
- భాగవతావతరణము ౦ ౮

## జనమంచి వేంకటరామయ్యగారివి

- వకుళమాంజలి—ఖండకావ్యసంపుటి ౧ ౪
- మాలతీమాధవము—నాటకము ౦ ౧౨
- రాజశేఖరునివిద్ధసాలభంజిక. నాటకము ౦ ౪

## శ్రీపాద కామేశ్వరరావుగారివి

- చంద్రగుప్త నాటకము ౧ ౪
- భారతరమణి డిటో ౧ ౦
- రాణాప్రతాపసింహ డిటో ౧ ౪
- శివాజీశీలము డిటో ౧ ౦
- లీలావతీసులోచనలు డిటో ౧ ౦
- బిల్వమంగళ డిటో ౧ ౦
- శ్రీమాధవాచార్యవిద్యారణ్య ౧ ౦
- చిత్రశ్మశ్రు డిటో ౧ ౦
- ఒకపెగ్గు డిటో ౧ ౦
- పునర్వివాహము డిటో ౧ ౦
- తగినశాస్తి డిటో ౧ ౦
- సంభాషణనిర్మాణము డిటో ౧ ౦
- కళాపాహాడ్ డిటో ౧ ౦
- సాహిత్యమీమాంస విమర్శగ్రంథము ౧ ౮
- నాటకవిమర్శ డిటో ౨ ౦
- కొత్తల్లుడు ప్రహసనము ౦ ౪
- పిసినిగొట్టు డిటో ౦ ౪
- జగన్నాథమాహాత్మ్యము_ప్రబంధము ౦ ౧౨
- ఉదంకుడు ౦ ౧[illegible]
- విరిసెజ్జ ౦ [illegible]

## బరంపురంకళాప్రచారక సమితివారివి

- రాయబారము—మొదటిసంపుటము ౧ ౦
- తేనెపట్టు—ఖండకావ్యములసంపుటి ౦ ౮

## పూలతోటగ్రంథమాలవారివి

- వేయిస్తంభాలగుడి శాసనము ౨ ౦
- మల్లికార్జునరావు. సాంఘికనవల ౦ ౧౦

## మల్లంపల్లి సోమశేఖరశర్మగారివి

- అనురాగతీర్థపము ౦ ౧౨

## విశ్వనాథ సత్యనారాయణగారివి

- వేనరాజు ౧ ౦
- అనార్కలీ ౧ ౦
- కిన్నరసానిపాటలు ౧ ౦
- ఆంధ్రప్రశస్తి ౧ ౦

## మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారివి

- పాలవెల్లి ౦ ౮
- తేనెపట్టు ౦ ౮

## దిగవల్లి వేంకటశివరావుగారివి

- ఇంగ్లీషు తెనుగుపారిభాషికనిఘంటువు ౨ ౬
- అధినివేశస్వరాజ్యం (ప్రశ్నోత్తరి) ౦ ౬
- సహకారవస్తునిలయోద్యమము ౧ ౦
- ఆంగ్లరాజ్యాంగము ౦ ౧
- భారతదేశస్థితిగతులు ౦ ౨

## బసవరాజు అప్పారావుగారివి

- గీతములు ౦ ౮

## విజ్ఞానచంద్రికామండలివారివి

- లక్ష్మణరాయవ్యాసావళి ౧ భాగము ౨ ౦
- కృషిశాస్త్రము ౨ ౪
- పాతాళభైరవి ౧ ౪
- రాయమారయుద్ధం ౧ ౪
- కందుకూరి వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్ర ౨ భాగము ౧ ౧౦
- అమెరికాసంయుక్తరాష్ట్రాలు ౧ ౮
- అల్లావుద్దీన్ అక్బరు ౧ ౧౪
- దక్షిణాఫ్రికా ౨ ౦
- హిందూమహాయుగము ౧ ౪
- హైందవచక్రవర్తుల జీవితములు ౦ ౪
- తురుష్కప్రజాస్వామికము ౧ ౬

## జయంతిపురం జమీందారుగారివి

- భారతదేశపురైల్లు ౦ ౧

## పురాణం సూరిశాస్త్రిగారివి

- నాట్యోత్పలము ౧ ౦
- నాట్యాలోకము ౧ ౦
- విమర్శకపారిజాతము ౧ ౦
- ఆంధ్రనాటకసంస్కరణము ౦ ౪

వలయువారు. కళాభివర్ధని పరిషత్తు. కలబరగి వారి యింట్లో, ఇన్నీసుపేట రాజమండ్రి అని రాసికోవాలి.

రాజమహేంద్రవరం : శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితమై,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. [illegible]